# ముసలమ్మ మరణము



కట్టమంచి రామలింగారెడ్డి

వి.సుశీలా ప్రసాద్

# ముసలమ్మ మరణము

## ఇత్యాదులు



కట్టమంచి రామలింగారెడ్డి

## ప్రకాశకుల విజ్ఞప్తి

కీ. శే. శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు విద్యార్థిగా నున్నపుడు వ్రాసిన 'ముసలమ్మ మరణము' పద్యకావ్యమును వారి షష్టిపూర్త్యుత్సవ సందర్భమున 1940 సం॥లో ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారు 3 వ పర్యాయం ప్రచురించినారు.

దీనికి వారి పద్య రచనలను మరికొన్నింటిని చేర్చి శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారి ఉపోద్ఘాతముతో గ్రంథాలయ పుస్తకశాలవారు 1948 వ సం॥లో "ముసలమ్మ మరణము - ఇత్యాదులు" అను శీర్షికతో నీ గ్రంథమును వెలువరించినారు. దీనిని ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారు 2 సం॥ల పాటు ఇంటర్మీడియేటుకు పాఠ్యగ్రంథముగ నిర్ణయించినారు.

ఇప్పుడీ గ్రంథమును హైదరాబాదునందలి ఆంధ్రసారస్వత పరిషత్ వారు తమ విశారద పరీక్ష ఉత్తర భాగమునకు పాఠ్యగ్రంథముగ నిర్ణయించుటతో దీనిని పునర్ముద్రించవలసి వచ్చినది. ఈఅవకాశం కల్పించిన ఆంధ్ర సారస్వతపరిషత్ వారికి, దీనిని మా సంస్థ పక్షమున వెలువరించుటకు వీలు కలుగజేసిన పూజ్యులు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు గారికి మానవమోవాకములు.

ఇట్లు విన్నవించు,

అయ్యదేవర బాలాత్రిపురసుందరమ్మ
పాతూరి చంద్రమౌలికరాజేశ్వరమ్మ
కార్యదర్శులు

శ్రీ సర్వోత్తమ భవనము
పటమటలంక
౭-౨-౧౯౬౦

# ఉపోద్ఘాతము

భావనాత్మకమైన కావ్య సృజనశక్తియు, వస్తుతత్వ వివేచనాత్మకమైన కావ్యవిమర్శ ప్రజ్ఞయు నొకేవ్యక్తిలోనే నెలకొనియుండుట యసంభవము గాకపోయినను నసాధారణము. అట్లుండుటయే తటస్థించిననాడు ఆవ్యక్తిచే రచింపఁబడిన కావ్యము కళాకౌశల పరిభూషితమును, తత్కృతమైన విమర్శము రసవంతమును నగును. అట్టివానిని కేవల విమర్శకుడనిగాని కేవల కవియనిగాని కాకుండ విమర్శకకవియని పేర్కొనఁదగును. ఆంగ్లేయ సారస్వతమున నిట్టి ఉభయ ప్రజ్ఞలుగల మహానీయుఁడు గతశతాబ్దిలో మేథ్యూఆర్నాల్డు (Matthew Arnold). ఆంధ్ర సారస్వతమున, ఈశతాబ్దిలో శ్రీకట్టమంచి రామలింగారెడ్డిగారు. ఆదేశమున ఆర్నాల్డును ఈదేశమున రెడ్డిగారును విద్యాశాఖాధికారులుగా సరస్వతీ సేవకే జీవితముల నంకితమొనర్చుకొనుటయు వీరి సాదృశ్యమును మరికొంత సన్నిహితము చేయుచున్నది.

ఆర్నాల్డుకుఁ బూర్వమునఁగాని యాతనికి సమకాలమునఁగాని ఆంగ్లభాషలో విమర్శకులు లేకపోలేదు. అయినను కావ్యవస్తు కావ్యప్రయోజనాది విషయములలో నాతఁడు ప్రతిపాదించిన యుత్తమాదర్శములే ఆతని విమర్శ వ్యాసములకు నుపన్యాసములకుఁ బరమ ప్రామాణ్యము నొసగినవి. అట్లే యిచటను రెడ్డిగారి విమర్శలకుఁ బరమ ప్రామాణికత్వమిచ్చినది మనసారస్వతములో వీరు ప్రవేశపెట్టిన నూత్న

విమర్శపద్ధతి. దీని స్వరూపమును వ్యాసమంజరి పీఠికలో యథాశక్తి నుగ్గడించియే యుంటిని.

మన దేశములో రామలింగారెడ్డిగారిని ఉత్తమవిమర్శకునిగాఁ గొనియాడుదురేగాని కావ్యకర్తగాఁ బెక్కుమంది యెఱుగరు. దీనికిఁ గారణము వీరి పద్యరచన సంఖ్యనుబట్టి మిక్కిలి పరిమితమగుట. పరిమితమేయయ్యు గుణమునుబట్టి చూచినచో, వీరి కవిత్వమునకు ఆధునిక పద్యవాఙ్మయమున నుత్తమస్థానమే కలదని చెప్పుటలో నత్యుక్తి యేమాత్రమును లేదు.

మన సారస్వతమునకు యథార్థమైన యాధునికత గత శతాబ్ది తుదిభాగములో ఆంధ్రభాషా పాండిత్యముతోపాటు ఆంగ్లభాషాభ్యసనముచేసిన విద్యాధికులవలనఁ గలిగినది. ఆంగ్లభాషాపరిచయము లేకపోయినను కాలప్రభావమునుబట్టి యేమి, స్వకీయ ప్రతిభా విశేషము చేతనేమి ఆంధ్రసరస్వతిని నవ్యరీతులఁ గై సేసిన మహామహులును బెక్కురు గలరు. వారినందరిని ఆధునికయుగమునకుఁ బూర్వరంగ ప్రవర్తకులని చెప్పవచ్చును. తదుపరి ఈసారస్వతరంగమునఁ గ్రొత్త వేషములను బ్రవేశపెట్టి నూత్న ప్రదర్శనములను జరిపిన సూత్రధారులు ఆంగ్లభాషానిష్ణాతులైన ఆంధ్రకవులే యనుట యథార్థమైనమాట. వీరిలో మరల రెండు తెగలవారుగలరు- ఛందోవ్యాకరణాది నియమములలోఁ, బలుకుబడిలోఁ బ్రాచీన సంప్రదాయములనే పాటించుచు, వస్తువిన్యాసము, భావ సంపద, మొదలైన కావ్యగుణములలో నూతనత్వము ప్రద

ర్శించిన వారొకరు; ప్రాచీన నియమముల నంతగాఁ బాటింపక ఛందములోను, బలుకుబడిలోనుగూడ సరిక్రొత్త త్రోవలు త్రొక్కినవారు ఇంకొకరు. వీరిలో మొదటివర్గమువారు ప్రాచీనులయు నవీనులయు నాదరాభిమానములకుఁ బాత్రులు కాఁగా, రెండవవర్గమువారు ప్రాచీనులను అంతగా మెప్పింపలేక పోయిరి. మధ్యకాలములో నెన్ని రూపాంతరములు పొందినను ఈ యుభయవర్గములును నాటినుండి నేటిదనుక భిన్నలక్ష్యములతో భిన్నమార్గములనే నడచుచున్నవి. ప్రాచీనతా పక్షపాతముగల నవ్యమార్గ ప్రవర్తకులలో మన రామలింగారెడ్డిగారు ముఖ్యులు.

ఇరువదియవ శతాబ్ది యుదయింపనున్న వేగుఁబోకలో నక్షత్రమువలె మన సారస్వతాకాశమున నవ్యకాంతులతో నావిర్భవించిన నూత్నాంధ్ర కావ్యము "ముసలమ్మ మరణము." రెడ్డిగారు 19 సంవత్సరముల యువకులైయున్నపుడు (1899వ సంవత్సరములో) చెన్నపురి క్రైస్తవ కళాశాలా-ఆంధ్రభాషాభిరంజనీ సమాజపోషకులగు శ్రీసమర్థి రంగయ్య శ్రేష్ఠిగారు ఈకావ్యముయొక్క పుట్టుకకుఁ గారణ భూతులు. ఉత్తమ కావ్యరచనలను బ్రోత్సహించుటకై శ్రీశ్రేష్ఠిగారు నెలకొల్పిన పోటీపరీక్షలో నెగ్గి పందెము గెల్చుకొని బహూకరింపఁ బడిన యీకావ్యమును, తత్కర్తయైన యువకవిని, సుప్రసిద్ధులైన ఆంధ్రకవి పండితులెందరో ముద్దుగా మెచ్చుకొని బహుగా నాశీర్వదించిరట! మన సంప్రదాయమునుబట్టి కావ్యము శుభాంతముగా నుండవలెను గనుక మరణాంతముగా

రచింపఁబడిన యీకృతిని ఎట్లైనను — కృత్రిమకల్పనతో నైననుసరే — మంగళాంతముగా సంస్కరింపవలసినదని కొందరు ఆబాలకవిని హెచ్చరించిరట. రామేశ్వరయాత్రాది బహుగ్రంథములు రచించి ప్రసిద్ధి వహించిన శ్రీగుండు అచ్చమాంబగారు, అందరకంటె నెక్కువగ హెచ్చరిక చేసిరట. మొగమోటమిచే నట్టివారి కోరికను ఈగ్రంథకర్త మన్నించియే యుండునేని ఈకావ్యమునకు నుండవలసిన పరిపూర్ణ నవ్యతయుండెడిదికాదు. కథాగతినిబట్టి సహజపరిణతమైన కావ్యము శోభావహమగును. అసహజమైన కల్పన, అసంభావ్యమై కావ్యకళకు హైన్యము నాపాదించును. అదిగాక మరణాంతములన్నియు నమంగళాంతములని యనుకొనుటయు దొసగే. కథాంతమున జరిగెడి మరణము లోకకల్యాణప్రదముగాఁ బ్రదర్శింపఁ బడునేని అది మంగళాంతమనియే బావించవలెను. సంఘశ్రేయమునకై నవ్వుమోముతో ఆత్మబలిని అంగీకరించి స్వయముగా మృత్యుదేవతాశ్లేషణమొనర్చుకొన్న ఆకాపుబిడ్డ ముసలమ్మ త్యాగము ఎంత లోకకల్యాణహేతువో చెప్పనక్కరలేదు. ఆ మహానుభావురాలి యఖండ త్యాగమువలన ఆగ్రామీణులందరు బిడ్డలతోఁ బచ్చగా నిల్చియుండుటయే ఈకథవలనఁ గలిగిన మంగళము. ఈకళాధర్మము నెరిగి కథ కీ పరిణామమునిచ్చిరి గనుకనే రెడ్డిగారు ఆంధ్రకావ్య సరణికి ఒక కొత్తదనము నాపాదించిన వారైరి. ఆధునిక యుగములో దృశ్యకావ్యములలో మరణాంతములనుప్రవేశపెట్టినవారు శ్రీధర్మవరము

కృష్ణమాచార్యులుగారనియు, శ్రవ్యకావ్యములలో నట్టి వానిని ప్రవర్తింపఁజేసినవారు రామలింగారెడ్డిగారనియు నాయూహ.

మనప్రాచీన ప్రబంధములలోని గాథలు ప్రాయికముగాఁ బౌరాణికములును, క్వాచిత్కముగాఁ జారిత్రికములును, అతి సకృత్తుగా సాంఘికములునునై యున్నవి. శృంగార మల్హణ చరిత్ర, నిరంకుశోపాఖ్యానము మొదలైన యొకటి రెండు సాంఘికప్రబంధములున్నను అవియు నిర్వహణమునఁ గృత్రిమ పర్యవసాయులే యైనవి. కాశీఖండము, పాండురంగమాహాత్మ్యము, శ్రీకాళహస్తి మాహాత్మ్యములోనగు స్థలపురాణములయందుఁ గొన్ని చక్కని సాంఘిక కథలు ఉపాఖ్యానములుగా సంతరింపఁబడియున్నవి. కాని కథాపర్యవసానమునుబట్టి యవియుఁ బౌరాణికరూపమే తాల్చినవి. ఆయా మతముల యెడ, ఆయా క్షేత్రములయెడఁ బ్రజలలో భక్తి శ్రద్ధలను గలిగించుటే ప్రయోజనముగా రచింపఁబడిన గాథలగుటచేత వానికి అసాధారణ రూపమును, అలౌకిక వాసనయుఁ దటస్థింపక తప్పదు. అచ్చపు సాంఘికకథ సంఘజీవితమునకుఁ బ్రతిబింబమై, భూలోక సంచారమును వదలిపెట్టనిదై తత్సంఘీయులతో సన్నిహిత బాంధవము కలదియై యున్నపుడే దాని సాంఘిక స్వభావము సార్థకమగును. అలౌకిక-అసామాన్య కల్పనలచేత స్వాభావికతను గోల్పోని సాంఘికేతివృత్తముగల కావ్యములు ఆధునికయుగముననే వెలసినవి. వానిలోఁ గొన్ని మహాకావ్యములును కొన్ని ఖండ కావ్య

ములును గలవు. మహాకావ్యములలో శ్రీ తిరుపతి వేంకట కవుల శ్రవణానందపాణి గృహీతలును, ఖండకావ్యములలో ఈ ముసలమ్మ మరణమును జననకాలమును బట్టియేగాక గుణ సంపన్నతను బట్టియు నగ్రగణ్యములు.

కావ్యమునకు రసాధాయకత్వమే పరమప్రయోజనము గదా! రచనా కౌశలమునుబట్టి యీసిద్ధి కలిగినపుడు ఇతి వృత్త మెట్టిదైననేమి? సాంఘిక మైనంతమాత్రమున విశేష మేమి? అనుప్రశ్నయొకటి యున్నది. ఇది వేయఁదగిన ప్రశ్నయే; సమాధానమును అపేక్షణీయమే.

కావ్యకళకు రసానందమనెడి పరనిర్వృతి పరమ ప్రయోజనమనుట సత్యమేగాని, ఈకళకు అవాంతర ప్రయోజనములు లేకపోలేదు. గౌణములయ్యును నవి సాధింపఁదగిన ప్రయోజనములే. వానిలో నతిముఖ్యమైనది సదుపదేశకత. ఈప్రయోజనమును ఆలంకారికులు మరచిపోలేదు. "కావ్యం ........................సద్యః పరనిర్వృతయే" అన్న చోటనే "యుపదేశయుజే" యనియు శాస్త్రములో వ్రాయఁబడియున్నది. కావ్యముచేయు ఆ యుపదేశస్వభావము దేశ కాల పాత్రవశమునను, కావ్యకర్తయొక్క ఆత్మీయతాప్రభావ వశమునను రూపొందుచుండును. ఒకకవి మతనిష్ఠను, మరి యొకకవి పరోపకారపరాయణతను, ఇంకొకకవి త్యాగశీల తను, వేరొకడు శౌర్యసంపాదనమును, ఇట్లే యనేకు లనేక విధములైన సదుపదేశములను వారివారి కవితాలక్ష్యమును బట్టి సల్పుచుందురు. ఈయుపదేశము వాచ్యమై రామణీయక

భంజకమైనచోఁ దిరస్కార్యమేకాని, అట్లుగాక వ్యంగ్యముగాఁగళామర్యాదానురూపముగా నున్నపుడు శిరోధార్యమే యగును. కళాసిద్ధియే కళకుఁ బ్రయోజనమనుట సర్వసమ్మతమైన సిద్ధాంతముకాదు. చిత్రకళలలో నితరములకు లేని యీ సామర్థ్యము కవిత్వకళకు నున్నది గనుకనే, యది సోదర కళలలో నగ్రస్థాన మధిష్ఠింపఁగలిగినది. ఈయుపదేశము ఆచరణయోగ్యము కావలెనన్నచో, ఆ యాదర్శమునకై కావ్యమునందుఁ జిత్రింపఁబడిన యాలంబనపాత్రలు మానవ సంఘమునకు నతీతమూర్తులుగా నుండరాదు. అతీతుల చరిత్రలను దేవలోక చరిత్రలుగా దూరమునుండి నమస్కరింతుమే గాని యనుకరించుటకుఁ బ్రయత్నింపఁజాలము. కావుననే ఆచరణయోగ్యమైన సదుపదేశమునకు సాంఘిక కథ యెక్కువగా నుపకరించును. ఏ దేశమందైనను, ఏ కాలమందైనను, తలచిన మాత్రమున ఓహో యని తలలూపింపఁజాలు సాంఘిక వృత్తాంతములెన్నో జరుగుచుండును. ఆంగ్లవాఙ్మయమునందిట్టివానిలోఁ బెక్కింటిని కవులు కావ్యములుగా సంతరించి తమజాతిని, జాతీయతాభిమానమును స్వదేశగౌరవమును గల దానినిగా దిద్దుకొనిరి. నలువైపులనుండియు నగ్నిజ్వాలలు నాలుకలుద్రోలుచు మ్రింగవచ్చుచున్నను జలింపక యగ్నికాహుతియగుపర్యంతము తండ్రిచే విహితమైన స్థానమువీడని కేసబియానికా (Casabianica) వృత్తాంతమును చిన్న ఖండ కావ్యముగా సంతరించిన ఆ యాంగ్లకవి తనదేశపు బాలురను ఎంతమందిని వీరకిశోరములుగా మార్పఁగలిగి యుండునో

యూహింపవలసిన దేగాని చెప్పశక్యమైనదిగాదు. అట్టి సాహసములు, నట్టి త్యాగములు నెరపిన వ్యక్తులు మన సంఘమునను లేకపోలేదు. కాని వారిపేళ్లు వినుటయు, మరచిపోవుటయు మనకుఁ బరిపాటియైనది. పుణ్యాత్ములైన యేపదకవులో అట్టి గాథలను గొన్నిటిని వీరపదములుగాఁ బాడిరిగాని ఆపద కవిత్వము నాగరకలోకమున స్థానము లభింపమిఁ బల్లెలలో నచ్చటచ్చట గ్రామ్యజీవనము గడుపుకొనుచున్నది. గ్రామములలో సైతము ఇప్పుడా పదములను బాడెడువారు లేరు, వినువారును లేరు. అట్టి గాథలతోఁ గావ్యరచనచేయుట జాతీయతాభివృద్ధికి నెంత యావశ్యకమో గ్రహించినవారికే గాని తక్కినవారికి ఆగాథలవిలువ తెలియదు.

ఈ ముసలమ్మ మరణము ప్రతి యాంధ్రుడును జదువవలసిన వీరగాథ. ఇట్టి సాంఘికేతి వృత్తముగల శోకాంత కావ్యము గనుకనే యిది నూతన కవితా స్వతంత్ర రీతులకు, ఆనాడు దృష్టాంతముగాఁ బేర్కొనఁబడినది.

తెనుగులో స్త్రీపాత్రకుఁ బ్రాధాన్యమిచ్చి వ్రాసిన కావ్యములు చాల తక్కువ. ఏకొలదిగనో యున్నను నవి శృంగారరస బహుళములేగాని యితరరస ప్రతిపాదకములు గావు. మరియు వానిలోను నేరెండుమూడిటనో తప్పఁ దక్కిన వానిలో ఆపాత్రలు వర్ణింపఁబడినవేగాని చిత్రింపఁబడినవి గావు. పాత్రవర్ణన యనఁగా దాని గుణగణము నంతయుఁ గవి, తానై యొక్కచోఁ బేర్కొనుట. పాత్రచిత్రణమనగాఁ గథాకార్యవశమున ఆపాత్రలయొక్క స్వరూప స్వభావ

ములు స్వయంవ్యక్తమగునట్లు చేయుట. ఈరెండవ పద్ధతిని స్వయం వ్యక్తమగునట్లు చేసిన పాత్రలే సజీవములనియు, ఆ సజీవతయే మూర్తీభవించిన కవిసృజనశక్తియనియుఁ జెప్పుదురు. ఈకావ్యములోని ముసలమ్మ పాత్ర యతినిపుణముగాఁ జిత్రితమైనదేగాని పూర్వ పద్ధతిని వర్ణితమైనదిగాదు. ఈ రచనకు శోభకలిగించిన విశేషములలో ఈపాత్ర చిత్రణ కౌశల మొకటి.

మఱియుఁ బూర్వప్రబంధములలోఁ బాత్ర చిత్రణము లేకపోఁగా మీఁదుమిక్కిలి, కొన్నింట, అతిమాత్రమైన స్త్రీ శరీరావయవ వర్ణనలు, కామబీజకములైన కథాసంఘటనలును ఆధునికులకు వానియెడ వైముఖ్యమును గలిగించుటకు హేతువులైనవి. "స్త్రీయనఁగా సుందర విగ్రహమనియు, పురుషుని సుఖానుభవమునకు నాలంబనమనియు, వ్యక్తిత్వములేని ఛాయవలె నాతని వెంబడించు నొక వింత యాకృతి యనియుఁ దెనుగు ప్రబంధకవుల యభిప్రాయమా" అని ఆత్మ గౌరవముగల యే మహిళామణియైనను ధిక్కారముతోఁ బ్రశ్నించుటకు వీలైనంత వాఙ్మయము మనలోనున్నది.

అతి పవిత్రమును, ఆధ్యాత్మిక కోశాధిరూఢమును, జీవేశ్వరైక్య ప్రతిబింబమును గాఁదగిన శృంగారము, లోక తిరస్కారమునకుఁ బాత్రమగుట యెంతయు శోచనీయము! ఈభ్రష్టతకుఁ గారణమైన కవుల దృష్టికి లక్ష్యభూతములైనవి, శరీర సంయోగ సౌఖ్యము, తృతీయ పురుషార్థ తృప్తియు. సమస్తప్రాణి సహజమైన యీజాంతవ తృష్ణ ఉత్తమమానవ

పాత్రలలోఁగూడఁ బ్రదర్శించుటవలన ఆ ప్రబంధములకు గౌరవముకంటె న్యూనతయే యెక్కువ వచ్చినది. తెనుగు వాఙ్మయమున ఈ పతనము ప్రత్యక్షముగాఁ దటస్థించుట విజయనగరసామ్రాజ్యపతనము నాటినుండియు. వాఙ్మయము యొక్క పతనాభ్యుదయములు జాతియొక్క పతనాభ్యుదయములతో సంవదించుచునే యుండును. శృంగార రసమును, స్త్రీపాత్రను, ఉద్ధరించినవారు ఆధునికకవులు. స్వచ్ఛమైన ఆధునిక సాహిత్యములో శృంగారమనగా ఆత్మసంయోగము; సౌందర్యమనగా గుణసౌందర్యము. ఈమార్పు సాంఘికముగా నెంత నాగరకమైనదో సారస్వతముగా నంత ఉదాత్తమైనది. ఆధునిక కవితకుఁ బ్రారంభకాలమున దారిచూపిన వారిలో ముఖ్యులు రెడ్డిగారని పైని చెప్పితిని. వీరిమార్గదర్శకత్వము స్త్రీపాత్ర గౌరవ సంరక్షణలోను గలదు. వీరి స్త్రీపాత్రలు సురుచిరోదార వర్తనచే లోకపూజ్యత నందినవే కాని రూప సౌందర్యముచే మనస్సునకు మరులు గొల్పునవి కావు.

విశేషించి ముసలమ్మ మరణమున శోభావహమైన మరియొక గుణము మృదులమైన కరుణరసపోషణ. జంత్రి గానములో, మ్రోతలేనినాదమునకై (Noiseless Sound) తంతిని గట్టిగానొక్కి మీటెడి గాయకునివలె, కరుణ భావావేశమును పొంగి పొరలనీక నిగ్రహించి నడపఁగల కవికే దాని నిశితత్వమును, భావితత్వమును సంపాదించుట సాధ్యమౌను. ఉత్తమ కవిత్వమునకు లక్షణము భావావేశ వ్యక్తీకరణము

గాను, భావనిగ్రహ వ్యక్తీకరణము. ఈవిధముగా, సాత్త్విక ముగాఁ గరుణారస స్ఫూర్తిని కలిగించుటలో రెడ్డిగారు సిద్ధ హస్తులు. తఱచి చూచినచో, సాత్త్వికమైన విషాదచ్ఛాయ యే వీరి కవితాప్రవృత్తికిఁ జోదకమాయని తోఁచును. ఇందలి కరుణరసచ్ఛాయలు తిక్కనగారి శాంతిపర్వము నందలి కపో తోపాఖ్యానమును దలపించుచున్నవి.

అసలు భావసంపదలోను, శైలీ సాధుత్వములోను రెడ్డిగారు ఆధునికాంధ్ర కవులలోఁ దిక్కనగారి ప్రథమ శిష్యులనిపించుకొనుటకుఁ దగిన యర్హతగలవారు. తిక్కనయు, తిక్కనగారి భారతమును వీరికి నిరంతరారాధ్య దేవతలు. కవిబ్రహ్మ "కారణజన్ము"డనియు, "ఆంధ్రలోక పరిశుద్ధ తపఃపరిపాక రూపు"డనియు "కవితా ప్రపంచ రవి"యనియు వీరి నిశ్చితాభిప్రాయము. ఇక భారతమునుగూర్చి "శైలిని వృత్తమున నగాధాలోచనలన్ మహాద్భుతాఖిల విధ పాత్రాళి ప్రదర్శనంబున భూలోకమునందు మొదటి పుస్తక"మని వీరికిఁ గల పూజ్యభావము. ఈభారతారాధనము రెడ్డిగారియింట నెలకొల్పిన వారు వీరి తండ్రి సుబ్రహ్మణ్యారెడ్డిగారు. వీరికి భారతాభిరుచి ఆతండ్రిగారినుండియే సంక్రమించినది. సుబ్ర హ్మణ్యారెడ్డిగారు తమ బహుకాల భారత పఠన మనన ఫల ముగా లభించిన పద్యరత్నములను, లోకయాత్రా నిర్వాహ ణమునకై యెల్లరు నిరంతరము పారాయణము సేయఁదగిన వానిని, భారతసార రత్నావళి యను పేర నేర్చికూర్చిరి. వారి భారత పరిశ్రమకు అదిఫలము. వారి కుమారులైన రామ

లింగారెడ్డిగారి భారతపరిశ్రమకు ఫలము లోకమునకింకను అందలేదు. "దానికి నానేర్చిన విద్యానిపుణత కొలఁదిఁ జేతు నాంధ్రంబున వ్యాఖ్యానము యథార్థ సంవిజ్ఞాన విధానముల నవ్యకళ లేర్పడఁగన్" అని వాగ్దానము మాత్రము చేసిరి. వీరి భారతవ్యాఖ్యానము కావ్యవిమర్శగా, తత్వమీమాంసగా, రాజనీతి శాస్త్రముగా, దేశచరిత్రగా, అది యిది యననేల, అందుఁగల సమస్తాంశములను స్పృశించు కూలంకష వివరణముగా నుండునని నాయూహ. భారతమనగా రెడ్డిగారికి ఆరాధ్య దేవతయేగాక ముద్దుల బిడ్డయు. అల్లారుముద్దుగాఁ బెంచి పెద్దచేసి, సౌభాగ్యవతి సంజంతీ కుమారిని, ఒకఅయ్య చేతిలోఁబెట్టి సాగనంపు నపుడు వీరి కోమలహృదయమునకుఁ గలిగిన శూన్యతను బోగొట్టి మనస్సునకు నూరటగలిగించిన భారతము వీరిపాలిటికి ఏమిగాదు? బిడ్డయన్నను అగును. తల్లి యన్నను అగును.

కవిత్వతత్వవిచారమను పేర కళాపూర్ణోదయ విమర్శము వలన ఆంధ్రసారస్వతమునకుఁ జేకూరిన మేలుకంటె భారత విమర్శమువలన నెక్కువమేలే లభించునని చాలమంది ఆశించు చున్నారు. తిక్కన సూరన లిరువురే వీరి విమర్శదృష్టికిఁ దాళిన ఆంధ్రకవులు. మరియే ప్రబంధ కర్తయు వీరిమనసునకు నచ్చలేదనుటలో దోసగేమియులేదు. ఊరక నచ్చకపోయినవి పోనిండు, అనౌచిత్యకళంకితములైన కొన్నిప్రబంధములు వీరి యేవగింపునకును పాత్రములైనవి. బిల్హణీయమట్టివానిలో నొకటి. ఆయేవమును పురస్కరించుకొనియే యందలి యనౌ

చిత్య ప్రతిఘటనకై నవయామిని యావిర్భవించినది. ఆరచ
నయు, దానికిఁ బ్రారంభమునఁగల సవిమర్శమైన "సంభవ
ప్రకార"మనెడి పీఠికయుఁ బెక్కుమంది విద్వాంసుల మన్న
నకుఁ బాత్రమగుట నేనెఱుగుదును. "తేజము దీర్ఘాయువు
విభ్రాజితలోక ప్రసిద్ధివఅలుత"మని బిల్హణుడు శిష్యురాలి
కొసగిన దీవనయే ఈకావ్యమునెడను సఫలమగుఁగాక!

ఇందు సంపుటీకరింపఁబడిన ఆరుఖండకావ్యములు రెడ్డి
గారు 1899 సంవత్సరము మొదలుకొని 1936వ సంవత్సరము
వరకుఁగల మధ్యకాలమున నప్పుడప్పుడు రచించిన వానిలోఁ
బోయినవిపోఁగా మిగిలినవి. వారి విమర్శవ్యాసములను సంపు
టీకరించి వ్యాసమంజరి యనుపేరఁ బ్రకటించుట యెంతయుప
కారకమయ్యెనో లోకమెరుగును. ఈఖండకావ్య సంపుటివలనఁ
గూడ సారస్వతమునకు అట్టి మేలు చేకూరఁగలదను నిశ్చితా
భిప్రాయముతో దీనిని వెల్వరించితిమి. ఈసంపుటీకరణమును
గురించి రెడ్డిగారికి నిజముగా అంత అభినివేశమే లేదు. కొంత
వరకు నాప్రోత్సాహమే యీప్రచురణమునకుఁ గారణము.

నేనుప్రోత్సహించిన కార్యము గనుక నేనే ప్రస్తావన
రూపమైన ఈయుపోద్ఘాతమును వ్రాయవలసిన వాడనైతిని.
ఇది కేవల పరిచయవాక్యమేగాని విమర్శగాదు. కనుకనే రెడ్డి
గారి కవిత్వమునందలి గుణవిశేషములనుగూర్చి వర్ణించుటలో
మిక్కిలి లోతునకుఁబోక లాంఛనప్రాయముగా నాలుగు సార
హీనపువాక్యములు వ్రాయఁగలిగితిని. ఈసాహసమును పండి
తులు సైతురుగాక.

ఆంధ్రవిశ్వకళాపరిషత్తు }
వాల్తేరు, 3–6–48 }

పింగళి లక్ష్మీకాంతం

(3)

# ముసలమ్మ మరణము

[1899 – కట్టమంచి]

## షష్టిపూర్తి ముద్రణమునకు

## తొలిపలుకు

ఇప్పటికి రమారమి ఇరువదియైదేండ్లక్రిందట శ్రీరామలింగారెడ్డిగారీ చిన్న పొత్తమును ప్రకటించుకొను నధికారమును ప్రీతిపూర్వకముగా నాకొసంగిరి. నేనొక్క ముద్రణము వేయించితిని. లఘుటీక చేర్చితిని. మధ్యకాలమున పునర్ముద్రణము చేయవలెనను కుతూహల ముండినదికాని నాస్వంత గ్రంథములకు పట్టిన యదృష్టమే నాసంపర్కముచేత దీనికిని బట్టినది. అనుదిన జీవిత మతిప్రయత్నముమీద గడుపుకొను నట్టిస్థితి నాకు చిరకాలముగ తప్పినదికాదు. కావున స్వంత పూచీమీద గ్రంథముద్రణము చేసికొనుట నాకు సాధ్యము కాలేదు. శ్రీరామలింగారెడ్డిగారి షష్టిపూర్తి మహోత్సవ సందర్భము తటస్థించినందున ఈ గ్రంథముద్రణమున కవకాశము కలిగినది. ఇది నా స్వశక్తిచే నిర్వహించినదిగాదు. ఆంధ్ర దేశ గ్రంథాలయసంఘమునకు నేను అధ్యక్షుడుగా నున్నాను. కార్యదర్శి శ్రీ పాతూరి నాగభూషణము డిప్. లిబ్. గారును నేనును ఉదారచరితులగు శ్రీ రెడ్డిగారికి మా యుద్యమముపరముగా నేరూపమున నీ షష్టిపూర్తిలో గౌరవముచూపి కృతజ్ఞతను వెల్లడించగలమా యని యాలోచించితిమి.

చంద్రునకొక నూలిపోగన్నట్లు ఈ గ్రంథము షష్టిపూర్తి ముద్రణమువేసి వారి కందియ్య దలచితిమి. గ్రంథాలయోద్యమధర్మము ప్రాతకాలపు పండితుల ధర్మము. విజ్ఞానము సర్వజనులకును వ్యాపింపజేయుట వారివిధి. ఆ విధియే మాయదియు. పండితులకెట్టు లచ్చి యచ్చిరాదని లోకోక్తి కలదో అట్లులే మా యుద్యమమునకును లచ్చి యచ్చిరాలేదు. రాజాశ్రయమున్న శ్రీనాథుని గతి మాదికాదు. పొలము దున్నుకొని బ్రతికిన పోతన మా కాదర్శమయినాడు. కావున 1914 ప్రాంతముల ఆరంభమయిన మా గ్రంథాలయోద్యమము సిరుల కొరవడినను ప్రజాభక్తి ప్రజాసేవల కొరవడక పనిచేసికొనివచ్చినది. నూర్లకొలది గ్రంథాలయములు స్థాపితమయినవి. నడచినవి. నడచుచున్నవి. పత్రికా పఠనము ప్రముఖముగా సాగినది. పల్లెటూరి గ్రంథాలయముల స్థాపన నిర్వహణములలో భారతభూమిలో తక్కిన యన్నిప్రాంతములకును ఆంధ్రభూమి యొజ్జయనిపించుకొనినది. ఆంధ్రభూమిలో జీవకళ యున్నదనిన నీయుద్యమ ప్రభావమని చెప్పిన నది యతిశయోక్తి కాజాలదు. ప్రజాసామాన్యమును వారి యిండ్ల వద్ద కలుసుకొని వారి హృదయములను చూఱగొను ప్రయత్నములు ఎచ్చటనులేని విచ్చటజరిగినవి. మొదటి 25 ఏండ్ల కార్యదర్శి ఏకైక కార్యనిర్వాహకుడు శ్రీఅయ్యంకి వెంకటరమణయ్య మెదడున గ్రంథాలయ యాత్ర స్వరూపముమెదలినది. అది కార్యరూపముదాల్చి కొన్ని ప్రాంతముల దివ్యమైన పనిసాగినది. అతడు 'గ్రంథాలయ సర్వస్వము' పత్రికను ఏకైక వీరుడై సాగించినాడు. కన్నబిడ్డకంటె గారాబముగ

నీ యుద్యమమును సాకినాడు. అతని పిదప కార్యభారము తలదాల్చిన మా నాగభూషణ మతనిని మించువాడు. ఈతని మొదటున బోటు గ్రంథాలయము మొదలినది. అది ఇతర ప్రాంతముల కుదాహరణ ప్రాయమైనది. వయోజనవిద్యార్థ గ్రంథరచన ప్రచురణము లితని వాంఛ దగిలినవి. పెద్ద పాలెములోని ఇతని సేవాశ్రమము—పదుల ఏండ్లుగా పదిల ముగా పనినడుపుకొని వచ్చిన పలుకుబంభములేని పట్టుదల సంస్థ— ఈపని నారంభించినది. అటు తాడేపల్లిగూడెమున గ్రామసేవాసమితి యను పేర గ్రంథాలయోద్యమ సేవకులు— డాక్టరు తేతలి సత్యనారాయణమూర్తి ప్రభృతులు — చక్కని చిన్నిప్రచురణములు బయల్వరచుచున్నారు. మా కార్యదర్శి శ్రీనాగభూషణము పట్టుదలచేత వారి మిత్రులు శ్రీకోమ్మా సీతారామయ్యగారి యౌదార్యాభిమాన త్యాగ ములచేత పటమటలంకలో మాయుద్యమ కార్యాలయమునకు భవననిర్మాణ ప్రయత్నమును సాగుచున్నది. 'గ్రంథాలయ సర్వస్వము' ఆంధ్ర 'గ్రంథాలయ' మను పేరిట పునరుజ్జీవిత మయి నడచుచున్నది. ఇప్పటి గవర్నమెంటు ఉత్తమాధి కారులమంచితనముచే లోకల్ బోర్డులు, మునిసిపాలిటీలు మా సభ్యులగుటకు అవకాశ మిటీవల చిక్కినది. విజ్ఞానవ్యాప్తి కార్యక్రమ చరిత్రయందు మన దేశమున నేటియుగమును వయోజన విద్యయుగమని వర్ణింపవచ్చును. ప్రజాప్రభుత్వ యుగమున నిది యంతర్భాగము. ఇట్టి తరుణమున శ్రీరామ లింగారెడ్డిగారు ప్రజలలో వ్యక్తులు-అందులో అబలలు ప్రజా క్షేమమునకై చేయగల అఖండత్యాగమును వర్ణించుచు

రచించిన ఈ 'ముసలమ్మమరణము'ను ప్రచురించుటకంటె వారికి మా చేయగల గౌరవము వేరుకలుగదని నిశ్చయించితిమి.

శ్రీ క. రామలింగారెడ్డి నాకు జ్యేష్ఠ సోదరుడు. నాయందలి ప్రేమచే కొంతకాల మతడు నన్ను 'సీనియర్'-జ్యేష్ఠుడని వ్యవహరించినను, అతడు క్రైస్తవ కళాశాలలో బి. ఏ. పట్టపరీక్షయందు చరిత్రలో తేరి డబుల్ డిగ్రీకొరకు-దుశ్శాలువల కొఱకన్నమాట- తత్త్వశాస్త్రము చదువుచు ఉపన్యాసవేదికలమీద ఇంగ్లీషు తెలుగుల రెంటిని అనర్గళముగా వెల్లువ లురికించుచు ప్రసంగించు దినములలో నే నా కళాశాలను ప్రవేశించి ఇతని యంతటి వాడను నేనెప్పు డగుదునో యని నోరూర్చుకొనుచు, నొసటిమీది ఆపెద్దమచ్చమీదను, అతని ముఖముమీదను తదేకధ్యానముగా దృష్టి నిలిపి అతనిని రమారమిగా ప్రేమించితిని.

నాటినుండి నేటిదనుక అతనిచరిత్ర వ్రాయుట నిట నాకు పనిగాదు. కాని అతనికి నాకును—అతడెచటనున్నను నే నెచటనున్నను—బంధుత్వ మెక్కడకలదా యని ఆలోచించినపుడు మాకు తెలిసిన సువార్త మరి యొకరికి వ్యాపింపజేయు గుణమునందున్నదని పలుమరుతోచుచుండును. కవిత్వతత్త్వ విచారము, అర్థశాస్త్రములు మహత్తమ సృష్టులే. రామలింగారెడ్డి ద్రౌపది శీలవర్ణనవ్రాసియుండిన నంతకంటె మహత్తర సృష్టియయియుండును. కాని రెడ్డిప్రతిభ ఇట్టి సృష్టులలో ఇముడలేదు. జిగిబిగిగల తెలుగుశైలి వ్రాసి చప్పటి తెలుగు వాక్యరచనకు చవులూరు గుణముకల్పించిన

కీర్తి యతనికి చెందవలెనేమో! నన్నయ యెడల నెంతయభిమానము నితడు చూపినను తేలికవ్రాతలలో తిక్కన ననుకరించినవారిలో మా రెడ్డియొకడనియు, రాయలసీమ వచనరచనకు నితడు పురోగామియనియు నాయూహ. శ్రీరాళ్ళపల్లి అనంత కృష్ణశర్మబోటి ప్రతిభావంతులను కనిపెట్టి లోకమునకు ఇచ్చుటలో రామలింగారెడ్డి అప్రతిమాన బుద్ధికౌశలమును మహోదారహృదయమును కనుపరచినాడు. ఆంధ్ర విశ్వవిద్యాలయము— నవ్యతేజోవిభాసితము— విద్యా పక్షమున పూర్ణముగా నతని సృష్టి.

ఇట్టి ఈ భాషా సేవకునికి, సరస్వత్యారాధకునికి, దేశ సేవాపరాయణునకు రెండరువదియేండ్ల ఆయువొసంగినను నొసంగతగినదే. ఈశ్వర కృప అపారముగ నీతనియెడల వెలయుగాక.

14 ఏ. సుంకువారి వీధి
ట్రిప్లికేన్, మద్రాసు
29-11-40

ఇట్లు, బుధజన విధేయుడు,
గాడిచర్ల హరిసర్వోత్తమరావు
ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘాధ్యక్షుడు

# ముఖపత్రము

చెన్నపురి క్రైస్తవకళాశాలకుం జేరిన శ్రీమదాంధ్రభాషాభిరంజనీసమాజమునఁ దత్పోషకులగు రాజశ్రీ, సమర్థి రంగయ్యసెట్టిగారిచే నూతనముగ స్థాపింపఁబడిన బహుమానకావ్యపద్ధతి ననుసరించి ఈకావ్యము రచియించితిని. ఇయ్యది పారితోషికమునకుఁ దగినదని యామోదించినందులకు వారికనేక వందనము లర్పించుచున్నాఁడను.

ఒకానొక త్రిలింగదేశీయునిచే వ్రాయఁబడి బ్రౌన్‌దొరగారిచేఁ బ్రకటింపఁబడిన 'అనంతపురచరిత్రము' అను గ్రంథమునుండి యిందలి కథం గైకొంటిని. అయినను గొన్ని యెడల రసాధిక్యమునకై నూతన కల్పనలు చేసినాఁడ.

అనంతపురమునకు సమీపమున బుక్కరాయ సముద్రము నేఁటికి నున్నది. ఆయూరి చెఱువుకట్టకు "ముసలమ్మకట్ట" యనియే పేరు. అచ్చట నేఁటేఁట జనులందఱుఁ బొంగళ్ళుపెట్టుచు ముసలమ్మను గ్రామదేవతగాఁ గొలుచుచున్నారు. ఆపల్లెలో నీవిషయమైన శిలాశాసన మున్నదఁట. ఈ గ్రంథము రచియించుటకుఁ బూర్వమే నాకీ సంగతులు తెలిసియుండిన నే నచ్చటికిఁబోయి సర్వమును జూచి తత్ప్రదేశస్వభావవర్ణన మిక్కుటముగఁ జేసియుందును. అనంతపురములోఁ గొన్ని సంవత్సరములు నివసించిన నామిత్రులగు నారాయణస్వామి నాయనిగారి యింట నే నీ పుస్తకమును జదివినప్పుడు వారే తద్గ్రామ సంబంధ విషయములం జెప్పనాకపరిమితాశ్చర్య మైనది.

ఈ చిన్నపొత్తము ముఖ్యముగా స్త్రీలకొఱకుఁ జేయఁబడినది. వారి కుపయుక్తముగా నొప్పినయెడల నా ప్రయాస సఫలత నొందినట్లే.

ఈ కావ్యమును నేఁ జదువఁగా విని కొన్ని తప్పుల సవరించినందులకు బ్రహ్మశ్రీ కొక్కొండ వెంకటరత్నము పంతులుగారికిని, ముద్రాపణ కార్యమును నిర్వహించిన మామక మిత్రులగు కందుకూరు మల్లికార్జునాచారిగారికిని వందనము లర్పించెదను. మఱియు నెన్నఁడు నన్నుఁ జూచి యెఱుఁగనివారయ్యు మల్లికార్జునాచారిగారి ప్రేరణచే విశేష కాలవ్యయమున కోర్చి యీ గ్రంథమును శ్రద్ధతోఁ జదివి యనేక విషయములనుసూచించిన దయాశాలురగు బ్రహ్మశ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారికి మత్కృతజ్ఞతాసూచక నమస్కారములు పదిమందికిఁ దెలియునట్లు నివేదింపఁ దరుణ మబ్బినందుల కెంతయు సంతసంబయ్యెడి. ఆర్యులారా! నేను నిశ్చయముగఁ బండితుఁడనుగాను. మఱి పామరుఁడను. బాలుఁడను కావున, నిం దెవ్వియేని దోషములున్నఁ జూపి నను గృతార్థునిఁ జేయ మీరెల్లరుఁ బ్రార్థితులు.

మద్రాసు,
క్రైస్తవకళాశాల
మార్చి, ౧౯౦౦

ఇట్లు విన్నవించు
సకల జన విధేయుఁడు,
కట్టమంచి రామలింగారెడ్డి

# ఉపక్రమణిక

శ్రీమత్కటుమంచీ పుర
ధామా! శుభనామ! దేవతాకోటి కిరీ
టామల పాదాంభోజా!
కామాక్షీ సహిత! సౌఖ్యకర! బాల్యేశా. ౧

ఉ. శ్రీలఁ జెలంగు లోకములు
సృష్టి యొనర్ప విరించివై, తగం
బాలన సేయ విష్ణువయి,
వాని లయింపఁగ శూలపాణివై,
లీల సరస్వతిన్ గలిమి
లేమను బార్వతిఁ గూడి వెల్గు ది
వ్యాలఘు శాంత తేజము జ
నౌఘ మహార్తి హరించుఁ గావుతన్. ౨

ఉ. శ్రీల నొసంగె యక్షున, క
రిప్రకరంబుల భండనంబునం
గూలఁగ నేయఁ జక్రమిదె
కొమ్మని శ్రీహరి కిచ్చె, నిచ్చె గౌ
రీ లలనా లలామకు శ
రీరము నర్ధ దాక యర్ధ, మిచ్చె గో
పాలున కన్యభాగ, మిటు
బాపురె సర్వముఁ గోలుపోయియున్. ౩

గీ. సకల జగములకును సాక్షివై, కర్తవై,
విభుఁడునై, శివుండు వెలుఁగుఁగాదె;

యిల్లులేనివాని కెల్ల గృహమ్ములు
సొంత మయ్యె ననెడు సూక్తి దోఁప. ౮

ఉ. ఏమనుజున్ దలంతు రిల
నెల్లరు నేమియు లేని వాఁడటం
చా మనుజుండ సర్వము స
మగ్రముగాఁ గలవాఁ డటంచు నే
స్వామి నిజైక చర్య జన
సంతతికిం బ్రకటించు, వాని లో
కామల సద్గురుం గొలుతు
నద్రిసుతాహృదయేశ్వరున్ హరున్. ౯

సీ. అంచ తేజీ నెక్కి యలరు సామిని జేరి
చదువుల గొంతియై చాల వెలిఁగెఁ
జిలువల యెకిమీని సెజ్జఁ బండెడువాని
చెలువయై కలుముల చేడె యయ్యె
గిత్త తత్తడిరాతు కేల్గేలఁ గీలించి
బుత్తి ముత్తుల నిచ్చు సత్తియయ్యె
ముగురు సాములకును మొదలింటి వెలుఁగయి
యట్టిట్టి దనరాని యవ్వ యయ్యె
*తే. నచలసంభూత, సదయ హృదంబుజాత,
నిర్గుణోపేత, పరిపూర్ణ, నిత్యపూత,

---

*పాఠాంతరము

తే. ఆశ్రితవ్రాత, సదయ హృదంబుజాత,
నిర్జగోపచితి ప్రీత, నిత్యపూత,
వాఙ్మనోతీత, సుగుణ సంపత్సమేత,
భువనమాత, భూభృజ్జాత, ప్రోచుఁగాత.

వాఙ్మనోతీత, సుగుణసంపత్సమేత,
పార్వతీమాత, మదభీష్ట వరము లీత. ౬

క. అమ్మా! మీకృప నేఁ బ
ద్యమ్ముల రచియింపఁ గడఁగి, తప్పొప్పుల భా
రమ్మొమ్మడిగట్టెద మీ కన
యమ్మను ననుఁ బ్రోవవమ్మ, యభవునికొమ్మా. ౭

శా. ప్రాహ్ణంబందు నభంగశోణమయతన్
బ్రహ్మన్ విడంబించి, మ
ధ్యాహ్నంబందుఁ బ్రచండ దీధితుల రు
ద్రప్రక్రియం బోల్చి, సా
యాహ్నంబందు ననంతశాంతత ననం
తాధీశునిం బోలి, స
ర్వాహ్నంబుల్ వెలుఁగొందు భాస్కరుఁ ద్రిమూ
ర్త్యాత్మన్ మదిన్నిల్పెదన్. ౮



క. ఇలలో స్వచ్ఛందంబుగ
మొలచిన యే శాకమైన భుజియించి, తపం
బులు సల్పుచు దారుణ వన
ముల నుండెడు పెద్దలెంత పుణ్యాత్ములో. ౯

గీ. కవికులబ్రహ్మఁ దిక్కన గణన చేసి,
సూరనార్యుని భావంబు సొంపుఁ బొగడి,
వేమన మహాత్ము సహజ విద్యా మయాత్ము
మ్రొక్కి, కవన మొనర్పంగఁ బూని నాఁడ. ౧౦



మ. తనరన్ రంగయ సెట్టిగారు కవితా
ధారానుమోదాత్ము లే
చిన నీవిం బహుమాన కావ్యముల నీ
శ్రీయాంధ్రభాషాభిరం
జననిం గోరిరి చేయ, నట్లగుట న
స్మచ్ఛక్తికిం దీటుగా
నొనరింపంగఁ గడంగినాఁడ విహిత
ప్రోత్సాహతన్ గబ్బమున్. ౧౧

సీ. ఆప్రొద్దు కూటికి నమ్మరో యనుచుండు
నట్టి బీదల యింట నవతరించి
పాలి వారందఱుఁ బగఁగొని యొనరించు
కుటిల కృత్యంబులఁ గ్రుంగకుండ
దైవంబునే నమ్మి దైవాజ్ఞ దుదకు న్యా
యస్థానవాదియై యలరెఁ జాలఁ
గార్వేటి నగరాది గంభీర సంస్థాన
ముల కెల్ల నొజ్జయై పూజ లందె

తే. నేకపత్నీవ్రతస్థుఁ, డహీన గుణుఁడు,
శారదేందు ప్రభా తిరస్కార కీర్తి,
కట్టమంచి సుబ్రహ్మణ్య ఘనుఁ డతండు
తండ్రిగానొప్ప నెంతయుఁ దనరినాఁడ. ౧౨

క. భారత భాగవతోజ్జ్వల
వారిధి గత సార పద్య వరమణి చయమున్

హారముగఁ గూర్చె నెవఁడా
సూరిని మజ్జనకుఁ దలఁచి చూడుఁడు నన్నున్.* ౧౩

---

* స్తుతి ప్రకరణమునందలి పద్యములు పెక్కు 1897-వ సం. చేయఁబడినవి. మాతండ్రిగారు "భారతసార రత్నావళి" యను గ్రంథముఁ బ్రకటించిన తరువాతను, "భాగవతసార ముక్తావళిఁ" బ్రకటించుటకుఁ బూర్వమును, కూచిమంచి సోమసుందరకవిగారు వ్రాసిన,

మ. తత బోధారస దీపితాఖిల మహా ధర్మోర్మికోపేత భా
రత వార్ధిన్ గల సార పద్యమణులన్ రత్నావళిం గూర్చె సీ
శ్రుతి తత్త్వజ్ఞుఁడు సూతుఁడో, శుకుఁడొ, వ్యాసుండో, గదే యంచు ధీ
రత మిమ్మెంచురు కట్టమంచికుల సుబ్రహ్మణ్య పుణ్యాహ్వయా.

అను పద్యమును జూచి ౧౩-వ పద్యమును గట్టితిని.

# అంకితము

క. ఎవ్వఁడు ప్రియమిత్రుఁడు నా
కెవ్వండు సమీపబంధుఁ, డెవని మొగము లే
న వ్వలర లేక చూడనో,
యెవ్వఁడు విధి లేక విడిచి యేఁగెనో దివికిన్. ౧౪

క. ఆతఁడు రఘునాథా హ్వయుఁ
డాతత గుణశాలి, యతని కర్పించెద; హా!
వ్రాఁత! యదెట్లగు? నీకృతి
నాతని యాత్మకు నొసంగ నా; నింతియపో. ౧౫

క. విస్తార హార సన్నిభ
నిస్తంద్ర యశో ధవళిత నీలగళ గళా!
శస్తాఖిల గుణ సహితా
ర్యస్తుత! రఘునాథరెడ్డి యాత్ముఁడ! వినుమా. ౧౬

---

రఘునాథరెడ్డి:— నామేనత్త కొడుకు, నాకంటెఁ బెద్దవాఁడు, విద్యావంతుఁడు. వీనితోఁ జిన్ననాఁటనుండి నాకు సాహచర్య మెక్కువ. నాచిన్నాయన కూఁతురి పెనిమిటి. పెండ్లియైన ఏడాదికే, మంచి తరుణ వయస్సున హఠాత్తుగ 1899 వ సంవత్సరమున మరణించెను. సత్స్వభావుఁడు. నా విద్యాభివృద్ధికిఁ దోడ్పడిన నేర్పరి.

# కథాప్రారంభము

శ్రీలాలిత వసుధా నా
రీ లలిత లలాట తిలక రీతిని ధన ధా
న్యాలిఁ బొలుచు నొక పల్లియ
చాలంగా బుక్కరాయసంద్రం బనఁగన్. ౧౭

సీ. చెఱకుఁ దోఁటలఁ జొచ్చి కొఱికి పాఁడొనరించి
దొరలట్లు పోవు పందుల గణంబు,
నెండ్రకాయల కొఱకే తెంచి గుంటిపై
మెక్కి కూసెడు గుంట నక్కగములు,
బడుగు బక్కలుగాక కడుపారఁ దిని పంది
గున్నలతో రాయు గొఱియ పిండుఁ,
బొలముల లేఁ బచ్చికల మేసి చియ్యచే
నిగనిగ లాడు గో నికరములును,

తే. గలకలారావములు మీఱఁ గలిసి జొన్న
చేలపై వ్రాలు గువ్వల చెలువుఁ గలిగి
పైరు పచ్చల నొప్పు నా పల్లె, చెఱువు
నిండి నీరంబు లొసఁగుచు నుండ నెపుడు. ౧౮

వ. ఆ యూరి చేరువ. ౧౯

మ. చలదుత్తుంగ మహోగ్రభంగపటలీ
సంఘట్టనారావ, ము
జ్జ్వల కూలాగ్రనటత్తరంగ రవ, మం
చన్మధ్యభాగుప్భమి భ్ర

త్కులసంపాతి మహోర్మికానికర ని
ర్ఘోషంబునుం, గూడఁగా
నలరున్ ఘోర సరస్సు దిగ్విదళన
వ్యాపార పారీణమై. ౨౦

చ. కడవల ముంచి వంచిన ప్ర
కారము, మన్నును మిన్ను నేక మ
య్యెడు గతి, రేవగళ్లు నొక
టే విధమొప్పఁగ, నాకసంబు తూఁ
టిఢెనో యనంగ, బల్విడుగు
లెక్కుడఁ జూచిన రాలుచుండఁగా
సుడిగొని గాలియున్ విసర
జోఁఅని వాన లొకప్డు వచ్చెనన్. ౨౧

శా. ఆ లాగుంగని రెడ్లు రైతులును దా
మాలోచనల్ చేసి "యే
కాలం బందును నిట్టి వానల వినం
గానంగ లేదెవ్వరున్
ఏలాగో మన మేమి చేయఁ గల" మం
చెంతేని భక్తిన్ వడిం
"బోలేరమ్మకుఁ బొంగలో" యనుచు స
మ్మోదించి చాటించినన్. ౨౨

క. నల్లని కోళ్లను బొట్టే
ళ్లెల్లరుఁ గొని మగలఁగూడి యేతెంచిరి యా
పల్లియ కొమ్మలు మిక్కిలి
జిల్లను నా గాలిఁ దనులు చిలచిల వడఁకన్. ౨౩

క. పొంగళ్ళు దిగిన తోడన
రంగుగ బలులిచ్చి, పళ్ళెరమ్ముల తళియల్
వొంగారఁగఁ, బూజారు ల
నంగారిశుభాంగి వర్ణనల్ చేసిరొగిన్. ౨౪

క. కరిముఖ విశాఖ చండీ
శ్వర భైరవ వీరభద్ర భవ్య కిరీట
స్ఫురదురు మణి గణ తేజో
భరభాసిత దివ్యపాదపద్మా! కాళీ! ౨౫

గీ. తల్లి! నీకుఁ గోటి దండంబు లర్పించి
భక్తి విన్నవించు వార మమ్మ
యాలకించి వేగ నాదరింపుము మమ్ము
జాగు సేయుట కిది సమయ మౌనె? ౨౬

ఉ. ఇంతకో యింకఁ గొంతకో య
హీనతరంగ భుజాగ్ర దర్పదు
ర్దాంతతఁ గట్టఁద్రెంచి, పటు
దంత విఘర్షణపీడ మానసా
క్రాంత మహోగ్రకోపశిఖి
గల్గు నురుంగు మొగంబు నిండఁగా,
సంతత సింహనాదము వి
శాల వికార శరీరముం దగన్. ౨౭

గీ. రక్కసుని మాడ్కి మమ్మెల్ల నొక్కగ్రుక్క
గొనఁగ మారి మసంగి నల్లైనసివచ్చు
నీ చెలువు బారినుండి మమ్మెల్ల నెల్లు
శుభముగా నేలుకొందువో చూడవలయు. ౨౮

క. అమ్మా! నేఁటివఱకు మము
ముమ్మరమగు కూర్మిఁ బెనిచి మురిపెంబుల నేఁ
డిమ్మాడ్కిఁ జెఱుపు వాతం
జిమ్మఁగ మనసెట్లు వచ్చెఁ జెప్పుము తల్లీ! ౨౯

వ. అనునంత నాకాశవాణి. ౩౦

క. బసిరెడ్డికిఁ గడ కోడలు
ముసలమ్మ యనంగనొప్పు పూతచరిత తా
వెస బలిగాఁ బోయిన మీ
కిసుమంతయుఁ గష్టమెన్నఁడేలా కలుగున్? ౩౧

క. అని తెగ నాడిన మాటలు
విని విస్మయశోకతాపభృత భావముతో
మనములఁ బొంగిన దుఃఖము
కనుల వెడలె ననఁగ నశ్రుకణము లొలుకఁగాన్. ౩౨

క. మన మొందు తలఁప దైవం
బున కామోదంబు లేక పోయెనుగద! బా
విని ద్రవ్వఁ బోవ లేచెం
బెను భూతం బనెడు మాట విశదం బయ్యెన్. ౩౩

క. సుదతీమణి కడు మెత్తని
హృదయంబును గలది పసిది యేమియెఱుఁగదా
పదలం బడ దెన్నండును
హృదయేశుని విడిచిపోవ నెట్లోపునొకో. ౩౪

వ. అనుచు వగచు జనంబులతోఁ గొందరు గద్గద కంఠం
బున నిట్లనిరి.

క. హృదయముల వగలు నెగయఁగ
నిది యేమిటి? వెఱ్ఱికూఁత లేలాకూయన్?
మది నుబ్బి సిరి కులుకక
పదివేల విధాలఁజెప్ప బాల నిలుచునే! ౩౬

చ. గుడిసెల మూఁటఁ బీఁకికొని
కొండొక చోటికిఁబోదమన్న "నీ
యెడ విడనాడమీకుఁదగు
నే" యనిపల్కెదె యాపె! యయ్యయో
చెడెఁజెడెఁ గార్య; మూరఁగల
చెల్వము మాసెను; ముల్లుదీసి కొ
ఱ్ఱడిచెను గాదె దేవి! యిఁక
నయ్యెడు శోకము చెప్పఁదీరునే! ౩౭

సీ. లేఁగమై నాకుచు లీలమై మెడ మలం
చిన గోవుఁబిండెడు వనరుహాక్షి
బొండుమల్లెలతోఁటఁ బువ్వులు గోయుచు
వనలక్ష్మి యననొప్పు వనజగంధి
బీదసాదుల నెల్ల నాదరించుచుఁ గూడు
గడుపారఁ బెట్టెడు కన్నతల్లి
వ్యాధిబాధల నెవరైన నడల జెప్ప
వేయక కాచెడు వినుతచరిత

గీ. బిడ్డలెల్లరుఁ దమవారి విడిచిచేరఁ
జంక నిడికొని ముద్దాడు సదయహృదయ
అమ్మ!నీకిల్లు వ్రాయంగనౌనె బ్రహ్మ
కనుచు నూరివారందఱు నడలి యడలి. ౩౮

సీ. అత్తమ్మకొంగు నన్వహముఁ బట్టికొని తాఁ
దిరుగుచుండును బిడ్డకరణి బాల
తనవారు పెఱవార లను భేదమే లేదు
హృదయ మన్ననో యప్పుడెత్తు వెన్న
యేవేళఁ జూచిన నెలనవ్వులే కాని
చిడిముడి పడ దెంత యిడుములున్నఁ
దనముద్దుమోముఁ జూచినఁ జాలు హృదయ తా
పంబెల్ల నప్పుడె పాఱిపోవు
తే. నహహ! మామపైఁగలభక్తి, యాత్మవిభుని
మీఁది మక్కువ, మఱఁదుల మీఁదికూర్మి,
ప్రజలమీఁది వాత్సల్యంబు, బ్రహ్మకైనఁ
జూప శక్యమే వేఱొక్క సుదతియందు. ౩౯
చ. అదియునుగాక నీమె మగఁ
డాత్మ సహోదరుఁడట్ల మమ్ముఁ జూ
చు; దినముతప్పె నేనియును
సువ్రతమెన్నఁడు బాయఁ; డాతఁడిం
కఁ దనమనంబు శోకశిఖి
కాఱియ వెట్టఁగ గుండె చీలఁగా
మదికొకసైనఁ దోఁప కతి
మానముతో నొకమూలఁ జేరఁడే? ౪౦
చ. అహరహమున్ దదుజ్జ్వల క
రాబ్జకృతాఖిల సౌఖ్యపాలికా
సహితుఁడు, తన్మనోవిభుఁడు,
చంద్రముఖిన్ గులకాంతఁ బాసి దు

స్సహాతర దుఃఖ హవ్యవహ
చండతరో గ్రగ శిఖాపరంపరన్
బహువిధ బాధలం బొరల,
వానిఁ గనుంగొను టెట్లొ యీశ్వరా! ౪౧

వ. అనుచు సమస్తజనంబులుం బురపూరఁబొక్కు సమయంబున.

గీ. తనకుఁ గడుఁగూర్చు ప్రజలకై తాను వేగఁ
బ్రాణముల్ వీడ సంతసపడియు బాల
మగని నత్తను మామను మఱఁదుల మఱిఁ
గలజనమ్ముల విడిచిపోఁ గాళ్ళురాక. ౪౩

క. లేనగవును గన్నీళ్ళును
గా, నెద తటతటయనంగఁ గాంతుని యెదుటన్
వానయు నెండయుఁ గలసెడు
చో నొప్పెడు నభమనంగ, సుందరి నిలిచెన్. ౪౪

వ. నిలిచిన నతండు వచ్చినకార్యమేమని యడుగుటయు. ౪౫

చ. అసమచరిత్ర! భూమి, జల
మందును, నగ్నిని, గాలిలోన, నా
కసమున, మీకు గోచరము
కానిది లే; దయినన్ మదీయమా
నసమును నేన చెప్పఁగ వి
నం గడు వేడుక పుట్టె నొక్కొ మీ
కు? సతుల మాటల న్వినఁగఁ
గోరుట భర్తల రీతియే గదా. ౪౬

క. అని, పూస గ్రుచ్చినట్లుగ
వనితామణి దెలిపె దేవివార్తలరీతిన్,

జనముల కష్టము చందముఁ
దన పూన్కి తెఱంగు, వినయ తత్పరమతియై. ౪౭

వ. పిట్ట పిడుగున్నట్టుండి శ్రవణరంధ్రంబుల విదారించిన వడువునఁ గర్ణకఠోరంబులై, నిజమృదులతర హృదయపుటవిభేదనకారణంబులగు మార్గణంబులై, వీతెంచిన యాయోషామణి భాషణంబులచేఁ దన మనంబు తామరపాకునందలి జలబిందువుం బలె నల్లలనాడ, నుల్లంబు జల్లన, మూర్ఛవోయి, కళ దేఱి, యన్నిటికి నీశ్వరుండు గలండని ధృతివహించి, దీర్ఘనిశ్వాసపూరిత ముఖుం డయ్యును, జలింపని యెలుంగేర్పడ నతండిట్లనియె. ౪౮

గీ. ఎంత మంచి మాటలు పల్కితేమి చెప్పు!
నింత కఠినచిత్తము నీకు నెట్లు కలిగె?
తెలిసి తెలిసి నన్నిట్టులు పలుకఁ దగునె?
పడఁతి! నీవు లేకున్న నే బ్రతుకఁ గలనె? ౪౯

క. నినుమాని నిముస మేనియు
వనజానన! యుండఁగలనె? ప్రతిన నెఱపఁగన్
జనఁదలఁచితేని, నన్నున్
గొనిపో నీవెంట, నిపుడ కోరిక వత్తున్. ౫౦

క. అది గానినాఁడు, సేమ
మ్మొదవఁగ నీయూరు విడిచి యొండొకయెడకేఁ
గుద మది మేలుగదా మన
కుఁదగన్ గాఁపులను గూడి గొబ్బునఁ దరుణీ! ౫౧

గీ. నోరునొవ్వఁ బల్కఁగనేల? సారసాక్షి
వినుము ననుఁ జంపినను నీకు ననువుగాఁగ

నాజ్ఞయొసఁగ-నేనొసఁగ; నీవలుగ వలవ
దింతి నాముద్దు చెల్లింపవేని విడువ. ౫౨

వ. అనిన నయ్యింతి చింతాక్రాంతయై, "కట్టా! యెట్టిమాటల వినవయ్యెఁ! ప్రాణేశ్వరుని పలుకులు విన విన బాల సూర్యోదయమ్మున విఱుగు మంచువోలె మన్మనోనిశ్చయము కరఁగుచున్నది. ఇఁక నీశ్వరుఁడే నా హృదయమున ధృతి నూఱఁజేయుచుండవలయు"నని చింతించి, ధైర్యం బవలంబించి, యా శుకవాణి తిన్నని యెలుంగేర్పడ నించుక కఠినంబుగా నిట్లు మందలించె. ౫౩

గీ. ఎఱిఁగి యెఱిఁగి మీర లీరీతి వాక్రువ్వ
సంతసించితిరి ప్రశస్త భంగి!*
మిమ్ముఁ జెప్పనేల? మీఱి నే నొడిఁ గట్టి
కొన్న పాపఫలముఁ గుడువకగునె? ౫౪

ఉ. పెద్దలనాఁటినుండి కడు
వేడ్క వసించిన యిండ్ల వీడుటల్
వృద్ధులఁ దల్లిదండ్రులను
వీథిని డించి చనంగఁ జూచుటల్
ముద్దుల సోదరుల్ వగవ
మోదముతో సతిఁగూడి పోవుటల్
గద్దఱికంబొ కాదొ మదిఁ
గాంచుఁడు వేఱుగఁ జెప్ప నేటికిన్. ౫౫

శా. హేయంబైన యిహంబువాసనలు మి
మ్మేలాగునం ద్రెమ్మె? నా

*పాఠాంతరము, తెలిఁగటంచుఁ దలఁచితిరో మఱేమొ.

థా! యత్యద్భుతమయ్యె; సంతతము నే
దైవంబుగాఁ గొల్చు మీ
రే యిట్లాడిన నేమిచెప్పఁగల? న
న్నీసారికిం "బోయిరా
వే" యంచుం దయఁ బంపవే; గుణనిధీ!
యే నిన్నుఁ బ్రార్థించెదన్. ౫౬

వ. అని వెడవెడ శంకవొడమ వెండియు నిట్లనియె. ౫౭

క. ఇది తగు నిది తగదని మీ
కుఁ దెలుప రాలేదు నేను గ్రొవ్వి మహాత్మా!
మది మీకుఁ గోపమయ్యెడు
నదియైన నెఱుంగఁ జేయుఁ డణఁగెద నింతన్. ౫౮

క. అనినం జిఱునవ్వానన
మున మొలకెత్తంగ నతఁడు పోలునె నీకి
ట్లనఁ బల్లంతైనను నిను
వనజానన! యెన్నఁడైన వారించితినే? ౫౯

వ. అని సకరుణంబుగాఁ బలికిన నబ్బాలయుఁ బ్రత్యుత్తరంబున కొక లేనవ్వుఁ బ్రచురించి యిట్లనియె. తాతముత్తాతలనుండి తరతరంబుగ వచ్చిన యిండ్లు వాకిండ్లు విడువఁ బాడికాదు. అట్లుకాదని విడిచిపోయినను మేలులేదు. ౬౦

గీ. తిండి యెట్లులు? నీళ్ళెట్లు? తిరిపమునకు
నమ్మరో యని యిల్లిల్లు నరుగఁ గలరె?
ఎవ్వరిత్తురు నేల? మీకెట్లు లిండ్లు?
చావరే పసిబిడ్డ లీసంకటముల? ౬౧

క. పొంగళ్ళు దిగిన తోడనె
రంగుగ బలులిచ్చి, పళ్ళెరమ్ముల తళియల్
వొంగారఁగఁ, బూజారు ల
నంగారిశుభాంగి వర్ణనల్ చేసిరొగిన్. ౨౮

క. కరిముఖ విశాఖ చండీ
శ్వర భైరవ వీరభద్ర భవ్య కిరీట
స్ఫుర దురు మణి గణ తేజో
భరభాసిత దివ్యపాదపద్మా! కాళీ! ౨౯

గీ. తల్లి! నీకుఁ గోటి దండంబు లర్పించి
భక్తి విన్నవించు వార మమ్మ
యాలకించి వేగ నాదరింపుము మమ్ము
జాగు సేయుట కిది సమయ మౌనె? ౩౦

ఉ. ఇంతకొ యింకఁ గొంతకొ య
హీనతరంగ భుజాగ్ర దర్పదు
ర్దాంతతఁ గట్టఁద్రెంచి, పటు
దంత విఘర్షణపీడ మానసా
క్రాంత మహోగ్రకోపశిఖ
గల్గు నురుంగు మొగంబు నిండఁగా,
సంతత సింహనాదము వి
శాల వికార శరీరముం దగన్. ౩౧

గీ. రక్కసుని మాడ్కి మమ్మెల్ల నొక్కగుక్క
గొనఁగ మారి మసంగి నట్లైనసివచ్చు
నీ చెలువు బారినుండి మమ్మెల్ల నెట్లు
శుభముగా నేలుకొందువో చూడవలయు. ౩౨

క. అమ్మా! నేఁటివఱకు మము
ముమ్మరమగు కూర్మిఁ బెనిచి మురిపెంబఱ నేఁ
డిమ్మాడ్కిఁ జెఱుపు వాతం
జిమ్మఁగ మనసెట్లు వచ్చెఁ జెప్పుము తల్లీ! ౨౯

వ. అనునంత నాకాశవాణి. ౩౦

క. బసిరెడ్డికిఁ గడ కోడలు
ముసలమ్మ యనంగనొప్పు పూతచరిత తా
వెస బలిగాఁ బోయిన యీ
కిసుమంతయుఁ గష్టమెన్నఁడేలా కలుగున్? ౩౧

క. అని తెగ నాడిన మాటలు
విని విస్మయశోకతాపభృత భావముతో
మనములఁ బొంగిన దుఃఖము
కనుల వెడలె ననఁగ నశ్రుకణము లొలుకఁగాన్. ౩౨

క. మన మొందు తలఁప దైవం
బున కామోదంబు లేక పోయెనుగద! బా
విని ద్రవ్వఁ బోవ లేచెం
బెను భూతం బనెడు మాట విశదం బయ్యెన్. ౩౩

క. సుదతీమణి కడు మెత్తని
హృదయంబును గలది పసిది యేమియెఱుఁగదా
పదలం బడ దెన్నండును
హృదయేశుని విడిచిపోవ నెట్లోపునొకో. ౩౪

వ. అనుచు వగచు జనంబులతోఁ గొందరు గద్గద కంఠం
బున నిట్లనిరి.

క. హృదయముల వగలు నెగయఁగ
నిది యేమిటి? వెఱ్ఱికూఁత లేలాకూయన్?
మది నుబ్బి నీరి కుఱుకక
పదివేల విధాలఁజెప్ప బాల నిలుచునే! ౩౬

చ. గుడిసెల మూఁటిఁ బీఁకికొని
కొండొక చోటికిఁబోదమన్న “నీ
యెడ విడనాడమీకుఁదగు
నే” యనిపల్కదె యాపె? యయ్యయో
చెడెఁజెడెఁ గార్య; మూరఁగల
చెల్వము మాసెను; ముల్లుదీసి కొ
ఱ్ఱడిచెను గాదె దేవి? యిఁక
నయ్యెడు శోకము చెప్పఁదీరునే! ౩౭

సీ. లేఁగమై నాకుచు లీలమై మెడ మలం
చిన గోవుఁబిండెడు వనరుహాక్షి
బొండుమల్లెలతోఁటఁ బువ్వులు గోయుచు
వనలక్ష్మి యననొప్పు వనజగంధి
బీదసాదుల నెల్ల నాదరించుచుఁ గూడు
గడుపారఁ బెట్టెడు కన్నతల్లి
వ్యాధిబాధల నెవరైన నడల ఱెప్ప
వేయక కాచెడు వినుతచరిత

గీ. బిడ్డలెల్లరుఁ దమవారి విడిచిచేరఁ
జంక నిడికొని ముద్దాడు సదయహృదయ
అమ్మ! నీకిల్లు వ్రాయంగనౌనె బ్రహ్మ
కనుచు నూరివారందఱు నడలి యడలి. ౩౮

సీ. అత్తమ్మకొంగు సవ్వాహమ్ముఁ బట్టికొని తాఁ
దిరుగుచుండును బిడ్డకరణి బాల
తనవారు పెఱవార లను భేదమే లేదు
హృదయ మన్ననో యప్పుడెత్తు వెన్న
యేవేళఁ జూచిన నెలనవ్వు లేకాని
చిడిముడి పడ దెంత యుడుకులున్నఁ
దనముద్దుమోముఁ జూచినఁ జాలు హృదయ తా
పంబెల్ల నప్పుడే పాఱిపోవు
తే. నహహ! మామపైఁగలభక్తి, యాత్మవిభుని
మీఁది మక్కువ, మఱఁదుల మీఁదికూర్మి,
ప్రజలమీఁది వాత్సల్యంబు, బ్రహ్మకైనఁ
జూప శక్యమే వేఱొక్క సుదతియందు. ౩౯

చ. అదియునుగాక నీమె మగఁ
డాత్మ సహోదరుఁడట్లు మమ్ముఁ జూ
చు; దినముతప్ప నేనియును
సువ్రతమెన్నఁడు బాయఁ; డాతఁడిం
కఁ దనమనంబు శోకశిఖి
కాఱియ వెట్టఁగ గుండె చీలఁగా
మదికొకసైనఁ దోఁప కతి
మౌనముతో నొకమూలఁ జేరఁడే? ౪౦

చ. అహరహమున్ దదుజ్జ్వలక
రాబ్జకృతాఖిల సౌఖ్యపాలికా
సహితుఁడు, తన్మనోవిభుఁడు,
చంద్రముఖిన్ గులకాంతఁ బాసి దు

స్సహాతర దుఃఖ హవ్యవహా
చండతరో గ్ర శిఖాపరంపరన్
బహువిధ బాధలం బొరల,
వానిఁ గనుంగొను టెట్లొ యీశ్వరా! ४౧

వ. అనుచు సమస్తజనంబులుఁ బురపురఁబొక్కు సమయంబున.

గీ. తనకుఁ గడుఁగూర్చు ప్రజలకై తాను వేగఁ
ప్రాణముల్ వీడ సంతసపడియు బాల
మగని నత్తను మామను మఱఁదుల మఱిఁ
గలజనమ్ముల విడిచిపోఁ గాళ్ళురాక. ४३

క. లేనగవును గన్నీళ్ళును
గా, నెద తటతటయనంగఁ గాంతుని మెదుటన్
వానయు నెండయుఁ గలసెడు
చో నొప్పెడు నభమనంగ, సుందరి నిలిచెన్. ४४

వ. నిలిచిన నతండు వచ్చినకార్యమేమని యడుగుటయు. ४౫

చ. అసమచరిత్ర! భూమి, జల
మందును, నగ్నిని, గాలిలోన, నా
కసమున, మీకు గోచరము
కానివి లే; వయినన్ మదీయమా
నసమును నేన చెప్పఁగ వి
నం గడు వేడుక పుట్టె నొక్కొ మీ
కు? సతుల మాటల న్వినఁగఁ
గోరుట భర్తల రీతియేగదా. ४౬

క. అని, పూస గ్రుచ్చినట్లుగ
వనితామణి దెలిపె దేవివార్తలరీతిన్,

జనముల కష్టము చందముఁ
దన పూన్కి తెలుంగు, వినయ తత్పరమతియై. ౪౭

వ. పిట్ట పిడుగున్నట్టుండి శ్రవణరంధ్రంబుల విదారించిన వడువునఁ గర్ణకఠోరంబులై, నిజమృదులతర హృదయ పుటవిభేదనకారణంబులగు మార్గణంబులై, వీతెంచిన యాయోషామణి భాషణంబులచేఁ దన మనంబు తామర పాకునందలి జలబిందువుం బలె నల్లలనాడ, నుల్లంబు జల్లన, మూర్ఛవోయి, కళదేఱి, యన్నిటికి నీశ్వరుండు గలండని ధృతివహించి, దీర్ఘనిశ్వాసపూరిత ముఖుం డయ్యును, జలింపని యెలుంగేర్పడ నతండిట్లనియె. ౪౮

గీ. ఎంత మంచి మాటలు పల్కితేమి చెప్పు!
నింత కఠినచిత్తము నీకు నెట్లు కలిగె?
తెలిసి తెలిసి నన్నిట్టులు పలుకఁ దగునె?
పడఁతి! నీవు లేకున్న నే బ్రతుకఁ గలనె? ౪౯

క. నినువాని నిముస మేనియు
వనజానన! యుండఁగలనె? ప్రతిన నెఱపఁగన్
జనఁదలఁచితేని, నన్నున్
గొనిపో నీవెంట, నిపుడ కోరిక వత్తున్. ౫౦

క. అది గానినాఁడు, సేమ
మ్మొదవఁగ నీయూరు విడిచి యొండొకయెడ కేఁ
గుద మది మేలుగదా మన
కుఁదగన్ గాఁపులను గూడి గొబ్బునఁ దరుణీ! ౫౧

గీ. నోరునొవ్వఁ బల్కఁగనేల? సారసాక్షి
వినుము ననుఁ జంపినను నీకు ననువుగాఁగ

నాజ్ఞ యొసంగ - నేనొసంగ; నీవలుగ వలవ
దింతి నాముద్దు చెల్లింపవేని విడువ. ౫౨

వ. అనిన నయ్యింతి చింతాక్రాంతయై, "కటా! యెట్టిమాటల వినవయ్యెం! ప్రాణేశ్వరుని పలుకులు విన విన బాల సూర్యోదయమ్మున విఱుగు మంచువోలె మన్మనోనిశ్చయము కరంగుచున్నది. ఇంక నీశ్వరుండే నా హృదయమున ధృతి నూరంజేయుచుండవలయు"నని చింతించి, ధైర్యం బవలంబించి, యా శుకవాణి తిన్నని యెలుంగేర్పడ నించుక కఠినంబుగా నిట్లు మందలించె. ౫౩

గీ. ఎఱింగి యెఱింగి మీర లీరీతి వ్రాకువ్వ
సంతసించితిరి ప్రశస్త భంగి!*
మిమ్ముం జెప్పనేల? మీతి నే నొడిం గట్టి
కొన్న పాపఫలముం గుడువకగునె? ౫౪

ఉ. పెద్దలనాంటినుండి కడు
వేడ్క వసించిన యిండ్ల వీడుటల్
వృద్ధులం దల్లిదండ్రులను
వీధిని డించి చనంగం జూచుటల్
ముద్దుల సోదరుల్ వగవ
మోదముతో సతింగూడి పోవుటల్
గద్దఱికంబొ కాదొ మదిం
గాంచుండు వేఱుగం జెప్ప నేటికిన్. ౫౫

శా. హేయంబైన యిహంబువాసనలు మి
మ్మేలాగునం గ్రమ్మె? నా

*పాఠాంతరము, తెఱంగటంచుం దలంచితిరో మఱేమొ.

థా! యత్యద్భుతమయ్యె; సంతతము నే
దైవంబుగాఁ గొల్చు మీ
రే యిట్లాడిన నేమిచెప్పఁగల? న
న్నీసారికిం "బోయిరా
వే" యంచుం దయఁ బంపవే; గుణనిధీ!
యే నిన్నుఁ బ్రార్థించెదన్. ౫౬

వ. అని వెడవెడ శంకవొడమ వెండియు నిట్లనియె. ౫౭

క. ఇది తగు నిది తగదని మీ
కుఁ దెలుప రాలేదు నేను గ్రొవ్వి మహాత్మా!
మది మీకుఁ గోపమయ్యెడు
నదిమైన నెఱుంగఁ జేయుఁ డణఁగెద నింతన్. ౫౮

క. అనినం జెఱునవ్వానన
మున మొల కెత్తంగ నతఁడు పోలునె నీకి
ట్లనఁ బల్లంతైనను నిను
వనజానన! యెన్నఁడైన వారించితినే? ౫౯

వ. అని సకరుణంబుగాఁ బలికిన నబ్బాలయుఁ బ్రత్యుత్తరంబున కొక లేనవ్వుఁ బ్రచురించి యిట్లనియె. తాతముత్తాతలనుండి తరతరంబుగ వచ్చిన యిండ్లు వాకిండ్లు విడువఁబాడికాదు. అట్లుకాదని విడిచిపోయినను మేలులేదు. ౬౦

గీ. తిండి యెట్టులు? నీళ్ళెట్లు? తిరిపమునకు
నమ్మరో యని యిల్లిల్లు నరుగఁ గలరె?
ఎవ్వరిత్తురు నేల? మీకెట్టు లిండ్లు?
చావరే పసిబిడ్డ లీసంకటములఁ? ౬౧

మ. తన దేహంబును, భూమియున్, దివము, మా
ర్తాండుండు, నాశాచయం
బును, వృక్షమ్ములుఁ, బక్షులుం, బ్రజలునున్,
భూధ్రంబులున్, సర్వమున్
దనకుం దోఁపవ; యెందుఁజూచిన నుదా
త్తం బైన తద్భక్తి కా
రణ మైయొప్పఁగఁదోఁచు శంకరజల
ప్రాయాంగసాయుజ్యముల్. ౧౦౩

సీ. కన్నెఱ్ఱవాఱిన ఖరకరోదయకాల
మల్లనక్రమింగు జాబిల్లి యనఁగ
జ్వాలదగ్ని శిఖలపై నెలనవ్వుతోఁ బోవు
ధాత్రీ మహాదేవి తనయ యనఁగఁ
గెందామరలబారు సుందరమగు లీల
నల్లనల్లనఁ జొచ్చు నంచ యనఁగఁ
గాల మహాస్వర్ణ కారకుం డగ్నిలోఁ
గరఁగించు బంగారు కణికయనఁగఁ
గీ. ప్రళయ కాలానల ప్రభాభాసురోగ్ర
రంగ దుత్తుంగ భంగ సంవ్రాతములకుఁ
గలఁక నొందక, దరహాస మలర, మంద
మందగతిఁ బోయి, చొచ్చె నమ్మగువ నీట. ౧౦౪

గీ. ఇచట నస్తమించి యినుఁడు పశ్చిమగోళ
మందు వెలుఁగుఁ గాదె? యట్లె దేవ
భువనమునను బొలుచు ముసలమ్మ యాంధ్రభా
షాభిరంజనిం దయఁగనుఁ గాత. ౧౦౫

మ. శివమై, చిన్మయమై, యఖండమయి, య
　　　　ర్చిష్మంతమై, నిత్యమై,
భవపాథోనిధినావమై, మునిజన
　　　　ప్రాణంబునై, యద్భుతా
ర్ణవమై, నామవికారరూపరహిత
　　　　ప్రాశస్త్యమై వెల్గు వి
ష్ణు విరించీశ్వరనాథతత్త్వము మనున్
　　　　శోభిల్లఁగాఁ జేయుతన్. ౧౦౬

మ. ఇది కట్నంచి నివాసుఁ, డార్యజనమై
　　　　త్రీచ్ఛాభిరాముండు, ధ
ర్మదయాశోభిత పాకనాటికుల సు
　　　　బ్రహ్మణ్య పుత్త్రుండు, దు
ర్మదదూరుండును, బ్రీతబంధుఁడవు రా
　　　　మస్వామికిన్ సీకృతుం,
డుదితామోదముమై రచించె విహిత
　　　　ప్రోత్సాహ సాహాయ్యుఁడై. ౧౦౭

# అంకితము-అర్థశాస్త్రము.

## [1911 మైసూరు]

### (స్వగతము)

క. అస్మత్ప్రియసఖ-...
సస్మేరముఖేందు బింబ సమ్యక్తేజో
భస్మిత శోకాంధతమస,
విస్మయ గుణధామ, మనసు వెడలునె యెపుడున్?

సీ. తనకీర్తి భూనభోంతరముల నిరసించి
చిఱునవ్వులై తన్నె చేరికొలువఁ
దన భావనాప్రభల్ ఘనవీథి గర్జించి
కలికి చూడ్కుల మెఱుంగులుగఁ బర్వఁ,
దన మనోహరత చంద్రజ్యోత్స్నలకుఁ బోక
నడకల సొగసులో నడఁగి యాడఁ
దన మార్దవము చిగుళ్లను బువ్వులను ద్రోచి
పలుకుల తీపిలోఁ గలసి మెలయ
నాత్మదేహమ్మునకు దేహమాత్మ కమరి
నట్లు, సుగుణము లవతార మందినట్లు,
భాసురాకార సుందర వర్తనములఁ
గనుల మనసును జొక్కించు కాంతఁ దలఁతు.

గీ. కనులు మూయునంతఁ గలలును, గలలలో
భవదుదారమూర్తి వచ్చి నిలుచుఁ;
గనులు దీర్ఘనిద్రఁ గప్పంగఁబడిన ని
న్ననవరతముఁ జూడనౌనె చెపుమ.

శా. పోయెన్ గాలము; ప్రాయమున్ గడచె; నిం
పుంబెంపులుం ద్రుంగె; మి
థ్యాయత్నంబులె కాని మన్మనమునం
దత్యంతమౌ మక్కువన్
బాయంజాలక నిల్పియున్నతమి సా
ఫల్యత్వముం జెందలే,
దాయుర్వృద్ధి యిఁకేలనాకుఁ; జనరా
దా వేగ నాప్రాణమా.

శా. చానా నిన్నుఁ దలంచి సంతతమునే
సంతాపముం జెంది మ
త్ప్రాణంబైన నొసంగి నీకు శుభముల్
భద్రంబు సేకూర్చి, నా
నా నవ్యోరు విలాససంచయములన్
రాగంబునం దేల్చ నెం
తో నాకుండెను; కాలసంఘటన మ
య్యో యిట్టులాయెంగదే.

చ. ఇఁకనొక జన్మమందయిన
నీశ్వరుసత్కృపచే భవద్గుణ
ప్రకటసమానభాసుర శు
భంబుఁబదంబును జెందుదమ్మ; నీ
యకుటిల వృత్తికిందగిన
యార్యులు మిత్రులు బంధులాదు, రీ
సకలము మెచ్చ శాశ్వతయ
శస్సు ధరింతుమటంచుఁ గోరెదన్.

క. మృదుమధుర పదఫలాస్పద
సదారుణ నవసుమ వాక్ప్రశస్తను, దర శా
రద చంద్రికా సమాన వి
శద దరహాసామలార్యచరిత, మఱతునే.

గీ. నేత్ర మరవిప్పఁజేయు స్వామిత్రు సహజ
చేష్టితమునకుఁ గోపంబు సిగ్గు వగపు
బెరయ, సౌరభోచ్ఛ్వాసంబు నరుణముఖము
మంచు కన్నీళ్లునై తలవంచి నిలుచు
కమల యొకటియె నీదు ముగ్ధతకు సాటి.

గీ. మెఱుఁగు దీఁగెల సరిగెల మెఱయు మొగిలు
చీర యొడలుగప్పఁగఁ గురుల్ జీరువాఱ
ఘననినాదముల్ కంకణ క్వాణములుగ
నలరి యాకాశలక్ష్మి నీళ్ళాడుచుతువ
నీ వివిధ విలాసంబుల నెఱపనేర్చు.

సీ. కల్లోలమాలికా కరముల వీచుచు
నెలుఁగెత్తి పిలిచెదు జలధినుండి
నిండార నెఱసిన పండువెన్నెల డాఁగి
నవ్వెదు నాతోడ నభమునుండి
గుసగుసల్ వోవుదు కోర్కెమై సురభి శీ
తల మందమారుతావళులనుండి
తేనెలతావుల జానగుప్పుల హి
మాశ్రులుబ్బఁగఁ జూచె దవనినుండి

ఛటఛటారవరాజి ప్రస్ఫుటము గాఁగ
ననుచితము సేయఁ గోపింతు వగ్నినుండి
సకల భూతమయాకార సారమహిమ
నీవు లేకయు నాకు నున్నావెపుడును.

# "కవిత్వతత్త్వవిచారము" పీఠిక.

## (1913 - మైసూరు)

క. నాతండ్రి సుగుణమణి ఖని
శ్రోత్రియుఁ డురువైభవుండు సుబ్రహ్మణ్యుం
డాతతగతి నాటిన వి
ద్యాతతుల ఫలంబు మీకు నభివేదింతున్.

మ. గుణమీమాంసమునందుఁ గొంచియును, సాం
గోపాంగపూర్ణమ్ముగా
ఘనమైనట్టి కవిత్వవిద్య నెఱుఁగం
గా నాకు శక్యంబె? యో
జనమై మీరు విచారణల్ సలిపి సం
స్కారంబులంజూపి భా
షను బెంపింకను మీఱఁదేర్తురను వి
శ్వాసంబునన్ వ్రాసితిన్.

ఉ. ఇంతియకాని నిర్ణయము
లేర్పఱుపంగ నెవండఁ? గార్యదే
శాంతర గామినౌట మును
పట్లటు వచ్చిన కొంత యాంధ్రముం
జింతయొనర్చుభంగిఁ బరి
శీర్ణతనెన్నఁడొ చెందెఁ, గాన సి
ద్ధాంతములేలనాకు? దయ
తప్పక చాలును మీరుచూచినన్.

క. పరిపరి విధములఁ బరిపరి
నరులారాధింప యౌవన మనశ్వరమై
పరగంగ నిత్యనవ్య
స్ఫురణమ్మునఁ బేర్చుకవిత సొంపేమందున్.

ఉ. కారణజన్ముఁడై జనని
కాయముమెచ్చఁగ భారతంబు నా
నారుచిరార్థయుక్తముగ
నవ్యతశాశ్వతమై తనర్ప వి
స్ఫార వచోధురీణతఁ బ్ర
శస్తగతిన్ విరచించె నెవ్వఁ డా
సూరిని నాంధ్రలోక పరి
శుద్ధ తపః పరిపాక రూపునిన్.

క. కవితాప్రపంచరవిఁ, ది
క్కవరేణ్యుం గొలిచి యతని కడిఁది యశః కాం
తివలన వ్యక్తములయిన
ట్టి విశేషంబులను గొన్నిటిని బ్రకటింతున్.

# అంపకాలు

## (1919 - బెంగుళూరు)

క. ఘనతర కూర్మిం బెంచిన
తనయను నే ధారవోసి ధన్యుఁడనయ్యెన్
మునిఁగితి శోకార్ణవమున
మనసునకున్ సుఖములేని మందిరమయ్యెన్.

గీ. కన్న కూఁతురి కంటెను మిన్నగాఁగఁ
జనవు ప్రేమయుఁ గూర్మియు సరసతయును
ముద్దును విలాసమును ప్రీతి మురిపెములును
దిన దినమ్మును నవనవ దీప్తి నెఱపి
మనసు కరఁగించి త్రావెఁ గుమారి నన్న.

గీ. చెలువు చెన్నును విలసత కలికితనము
నెలయఁ దనమాయ జీవంబు చిలికి చిలికి
తనివి లేనట్టి ప్రేమామృతంబు చవిని
జూపి పోయె; నా బ్రతుకింక శూన్యమగును.

గీ. మనసు ప్రాణంబు నెదయుఁ గుమారి తనవ
శంబుగాఁ జేసికొనిపోవ జడునిభంగి
వెనుకఁ జిక్కి తపించెడి విధియ నాది;
మైన సుత సుఖంబుగనున్న నదియ చాలు.

క. తలఁపుల స్మృతిచే నాసుత
కలిమి చెలిమి నెంచిమెంచి కష్టంబుల కో

ర్చి, లలన కెల్ల శుభంబులు
చెలఁగంగాఁ గోరి శాంతి చేకూ ర్తు నెదన్.

క. నీ సుఖమే నా స్వర్గము
భాసిలు నీముఖమె నాకుఁ బరమార్థము నీ
వేసటయె నాకు నరకము
నాసంజంతీ! కుమారి! నను మఱవకుమీ.

గీ. కన్న పుణ్యంబు సేయనగాని నిన్ను
స్వీయముగాఁ బెంచి ముద్దాడు వరము వడసి
నీవ పుత్రియుఁ దల్లిగా నిరతమనయ
గౌరవానందములఁ గొంతకాలముంటి.

ఉ. తల్లి, కుమారి, ముద్దులసు
తా, నిను నెప్పుడు నెల్ల తావులన్
జల్లఁగనుండి సౌఖ్యములు
చక్కఁగఁ జెందెడురీతిఁ జేయఁగా
నెల్లస్వభావశక్తులను,
నెల్లమహాత్ములు, నెల్ల దేవతా
సల్లలితప్రభావులను
సర్వవిధంబులఁ జాలవేఁడెదన్.

# భారతప్రశంస

## (1919—బెంగుళూరు)

క. ఘనమగు ప్రీతింబెంచిన
తనయను నే ధారవోసి ధన్యుఁడనయ్యెన్
మునిఁగితి శోకార్ణవమున
మనసునకున్ సుఖములేని మందిరమయ్యెన్.

క. కానన్ భాషాకన్యం
బూని పునఃప్రీతి నింట ముద్దుగ నే ని
త్యానందతకై నిలిపెద
నేనాఁడును జేయి విడిచి యేఁగద నన్నున్.

క. అని చింతాక్రాంతంబగు
మనసున ననుకొన్నమాడ్కి మహితగ్రంథం
బును జేయఁబూని భారత
మనూన శాంతప్రధాన మగుటను మఱియున్.

క. శైలిని వృత్తమున, నగా
ధాలోచనలన్ మహాద్భుతాఖిలవిధ పా
త్రాళి ప్రదర్శనంబున
భూలోకమునందు మొదటి పుస్తకమగుటన్

క. నాతండ్రి కనారతమును
జేతోముద మిచ్చినట్టి శిష్టచరిత్రం

బైతనరాకుట మొదలగు
హేతువులం జేసి మనసు నీడ్చినదగుటన్

క. దానికి నానేర్చిన వి
ద్యా నిపుణత కొలఁదిఁ జేతు నాంధ్రంబున వ్యా
ఖ్యానము యథార్థ సంవి
జ్ఞానవిధానముల నవ్యకళ లేర్పడఁగన్.

# నవయామిని

## (1936-చిత్తూరు)

(అంకితము—మునగాల జమీందారులైన
శ్రీ నాయని వెంకటరంగారావుగారికి, అత్యంత ప్రీతిమై)

### సంభవ ప్రకారము

బిల్హణీయము అనాదరణీయమైన కావ్యము. విషయము మంచిది కాదు. కల్పన సత్యమునకు, నైజమునకు విరుద్ధము. కథానిర్మాణమునందుఁ బ్రాయోభావము ప్రాణము వంటిది. అనఁగా వర్ణింపఁబడినరీతిని బహుశః విషయములు జరిగియుండు నను భ్రాంతిని పాఠకులయందుఁ గలిగించుట కవి యొక్క ప్రథమకర్తవ్యము. ఈమాత్రము భ్రమ కలిగింపనేరనిచో అది జీవకళ లేని శరీరమట్లు శవసమానము.

బిల్హణీయమందు కథానిర్మాణము ప్రాయోభావ విహీన మగుటకుఁ గారణములు ఇవి కొన్ని :-

౧. ఎంత తెలివిలేని రాజుగా నుండినను యువకుఁడైన పండితుని యువతియైన కుమార్తెకు గురువుగాఁ జేర్చి వారికి ఏకాంతసంఘటనము నిరపాయముగ, నిర్భీతిగ జరుగునట్లు మర్చియుండునా? గురువు గొప్ప పండితుఁడుగదా, కాఁబట్టి అంతయువకుఁడుగా నుండియుండునా? సహజవిద్యాధురీణుఁడు కాఁబోలు ! సరే.

౨. కాని, కుమార్తెతో సహపాఠినులుగ బాలికలను గొందఱిని జేర్పలేకపోయెనా? వృద్ధస్త్రీలనో, సొంతపుఁదల్లినో

మాటరాకుండునట్లు యామినితో సహచరత్వము – సహజము, సర్వసాధారణమైనది–చేయుట ఎట్లు? స్త్రీస్వాతంత్ర్యము ప్రబలముగానుండు ఐరోపాలో చాపిరోన్స్ (Chaperons) అను పేరఁ దమ కుమార్తెలయొక్క పేరుప్రతిష్ఠలు అపవాదములపాలఁబడకుండునట్లు మంచిస్త్రీలను సహచారిణులుగా నియమించుట అనుల్లంఘ్యమైన సాంఘికనీతిగా సర్వత్ర అవలంబింపఁబడియుండుట సుప్రసిద్ధము. ఇంక హిందువులలో, అందును రాజకుటుంబములలో నేనిరోధము లేని ఇట్టిరీతిని యువతీయువకులకు ఏకాంతసంఘటనము ఎవరైన ఎట్టిమూఢులైనఁ జేకూర్తురా?

ఇఁక రాజన్ననో, కీడు కొడు లేని మూఢశిఖామణి కాఁడు; సంశయాత్ముఁడు. పరస్పరదృష్టులను, స్పర్శలను నిరోధించుటకును, అసంభవములను జేయుటకు కట్టుకథలు గట్టినాఁడఁట. సర్వసాధారణములైన సహజోపాయము లుండఁగాఁ బుక్కిటిపురాణములను ఆశ్రయించినాఁడఁట. ఈకథలకు ఉపోద్బలముగాఁ గాలికిఁ జేతికిఁ జలనముఁ జెందు తెర నొకటి వేసి తృప్తిఁజెందినవాఁడఁట. ఇది రాజుగారి నీతి నిర్మాణ కౌశల్యము!

మనయవి సహకుటుంబములు. బంధువులు, భార్యలు, తక్కినవారు ఇట్టి వివేకవిహీనతాపద్ధతులను ఆక్షేపించి అడ్డగింపకపోయిరా?

ఇందలి కథానిర్మాణము విశ్వసనీయత్వము ఇసుమంతయు లేనిది. మిథ్య, శూన్యము.

మఱి బిల్హణుఁడు విద్యావంతుఁడు. ధర్మబుద్ధి ఏమాత్రము లేనివాఁడా? యామినీకుమారి గొప్పవంశమునఁ బుట్టిన బిడ్డ. హిందూయువతి. గురుశిష్యులకుఁ బరస్పర మోహము అసంభవ మనరాదు కాని, వారు ఆరీతిని జంకు శంక ఏమాత్రము లేక, నిగ్రహబుద్ధియు శమనశక్తియు నేమాత్రము లేనియట్లు పరస్పర వశులగుటకుఁ బశువులా?

ఇట్టి విచారముల వలన ఈ గ్రంథము నీచాతినీచమని నాకుఁ జిన్ననాఁడే తోఁచినది. అయినను గురువులు శిష్యురాండ్రను మోహించుట అరుదైనను అసంభవము కాదు. అట్టి మోహము నాధారముగాఁ జేసికొని యామినీ బిల్హణుల చరిత్రమును విశుద్ధమును, సహజతాగుణసంయుతమును అయినతీరున వ్రాయ నెన్నోయేండ్లక్రిందట సమకట్టి చేసినాఁడ. దానియొక్క పరిష్కృతమైన ప్రతియ ఈ "నవయామిని"

నాయొక్క "భావాంబరవీథి" విహరించు యామినీ బిల్హణుల ప్రకృతు లివ్వి:—

౧. బిల్హణుఁడు;—పండితుఁడు. వయస్సు చెల్లినవాఁడు కాకున్నను కొంతవఱకు ముదిరినవాఁడు. ధర్మబుద్ధి, నిగ్రహశక్తి ఏమాత్రములేని విషయలోలుఁడు గాఁడు. నిజశీలము చలితమయ్యెనేని పునరాలోచనమై సమర్థించుకొనఁజాలిన నిగ్రహకారి.

౨. యామిని :— వయస్సునను, వర్తనమునను ఆర్య. పరిశుభ్రమనోగతిఁ గలది. సచ్ఛీల. గయ్యాళికాదు. మృదు

త్వము, స్థిరత్వము కలిసిన హృదయము గలది. భావములు వెన్న. పల్కులు తేనెలు. ధర్మసంకల్పము వజ్రమువంటిది.

ఇఁక నేను ఈ యధిక ప్రసంగము నింతటితోఁ జాలించి పాఠకుల అనుగ్రహమునకు నా "నవ యామినిని" దత్తము చేయుచున్నాను — అనఁగా కుమారిక గాఁగ.

—: బిల్హణుఁడు మోహించి తన మనోరథమును యామినీ కుమారికిఁ దెలుపుట :—

మొగము వికసించి చిఱునవ్వుపువులు గురియు;
తెలివికాంతుల వెదచల్లుఁ దేటకనులు;
నోరు పండి రుచులమించునుడుల రాల్చు;
వరవిలాసిని నే నెట్లు వలనకుందు ?

కృత్రిమము లేని విలసనల్, మైత్రి మెఱయు
చుక్కలను బోలు నఖముల సోయగంబు,
ప్రేమబంధురహృదయంబు వెలయు నిన్ను
ప్రాణముల హత్తి కే నెట్లు వదలియుందు ?

సరసమధుర చమత్కార సౌమనస్య
భాసురములౌ భవద్రమ్యభాషణములు
మనసు రంజిల్లఁ జేయఁగా మమత పుట్టి
యెదుగుచున్నది; మితి లేద; యేమిసేతు ?

పెరిమయు, గరువతనము, ను
ద్ధురవినయము, భక్తి శ్రద్ధ తుఱఁగలిగొన, న

న్నరసి సపర్య లొనర్చెదు
సురుచిరభవదీయమూర్తి శుభ్రత నెంతున్.

కనులను, వీనుల, హృదయం
బును, మనసును విభ్రమమున ముంచితివి సుహా
సిని! యిన్నాళ్లకు నిక్క౦
బును బూర్ణము నైన మోహాపుం జవిఁ గంటిన్.

పరవశుఁడఁగాక యిన్నేండ్లు బ్రతికి, నేఁడు
నాకు నీవశంబగుట సంతసమ కాని,
కాఱుతప్పి, కాలము సెడి కర్షకుండు
విత్తు చల్లిన ఫలమున్న ? వెఱ్ఱిగాదె ?

ఆత్మసుఖమును నేఁగోర, నమలమును, స
మృద్ధమును శాశ్వతము నైన మేలిసుఖము
నీకు నెల్లెడ సిద్ధించుఁగాక రమణి,
ప్రాణసఖుఁడని ననుఁ గోరి పనులఁ గొనుము.

కాలభానుండు పడమటికడకు వ్రాలెఁ;
గ్రమ్ముచున్నవి సంజచీఁకటులు నన్ను;
అట్టిచో నేకశుభ్రమున ట్లద్భుతముగ
దివ్యమూర్తి! నీ వుదయించి, తేజమును మ
హోజ్జ్వలాహ్లాదమును గూర్చి తుత్పలాక్షి !

చెలువును సిరియును విద్యయు
నలఘుతనము భూతహిత దయార్ద్రవీక్షలు క్రొ
న్నెలనవ్వు మృదుస్వరమును
గల నిను గాంచినదిగోలెఁ గానన నిదురన్.

కావలెనని నేఁ గోరన
యీవిధమగునని యెఱుంగ; నీ సంతాపం
బేవిధి భరియింపంగల
నీవే దయఁ జూపవేని నిలుచునె యసువుల్.

అని బిల్హణుఁడు చెప్పఁగా విని—

కాఱుచీఁకట్లఁ జుక్కల గములఁ బోలుచు
నమవసనిసి యనంగ మధ్యాహ్నవేళఁ
గాంతులును నీడలును మిశ్రగతులఁ గదల
నలరు చెట్లక్రిందటి పచ్చికల విధమున

సంతసమును విషాదంబు సదమలాత్మ
యందుఁ బెనఁగ, నాశ్చర్యంబు వ్యథయుఁ గూర
నెండయును వానయును మది నిండి పొరలి
నట్లు దీక్ష్ణతయును నశ్రు లడరఁ గనుల.

యామినీకుమారి ఇట్లనియె :—

## ౨

-: యామినీకుమారి ప్రతివచనంబుల బిల్హణుని మందలించుట:-

సంతసించితి నీ సరసప్రసంగ
రీతిఁ దిలకించి; కంపించె హృదయ మనఘ;
అద్భుతంబున మునిఁగె నా యాత్మ; యేమి
యెటుల బదులాడఁ బోలునో యెఱుఁగనేర.

నీవు మనోజ్ఞమూర్తివి; వి
నిర్మలకీర్తివి; జ్ఞానమందు వి
ద్యా విభవంబునందుఁ బర
మాద్భుత శక్తివి; నాకుఁ జూడఁగా
దైవముఁ, దండ్రియున్, గురువుఁ,
దల్లియు నీవ సఖుండవున్ సదా;
కావున సాహసించితిని
గర్మము ధర్మము పూని తెల్పఁగన్.

నీవు కడింది ప్రేమ నను
నిచ్చలు గారవమొప్పఁ బూజ్య శా
స్త్రావళి నేర్పి గ్రంథనిచ
యంబులఁ బాఠముఁ జెప్పి దిద్ది స
జ్జీవ విధానముల్ గఱపి,
చేసితి విట్టిది గాఁగ నన్ను; నా

భావము నీ యధీనము; స
పర్యల నిన్ దనియించు టొప్పగున్.

నీ పావనశిష్యత్వము
నా పూర్వతపఃఫలంబ నయనిధి! నీకున్
గోపనపరనై యుండెద
నీ పెంచిన బిడ్డపేరు నేర్తువె చెఱుపన్ ?

క్షణికము నీయీ మోహం
బనఘా, నిక్కంబ కాద యని యెఱుఁగుదు, సూ
ర్యుని పార్శ్వగ్రహణము కాం
తిని మాయునె? చాలసేపు నిలుకడఁ గనునే?

ఇవి నా నిరాకరణ వా
క్య వికటములు గావు, మీ సదాదేశ పవి
త్ర వివిధ సూక్తులె, నా హృద
య వివరము వెడలి ప్రతినినదార్భటి రేఁగెన్.

నీ ప్రతిబింబమగద నే
నో పావనమూర్తి, కినియనోపుదె నాపై ?
నీ పోషించిన లతికను
నీ పట్టున నలరనిమ్ము నిర్మల నియతిన్.

## 3

—: భిల్హణుఁడు బుద్ధి తెచ్చుకొని పశ్చాత్తాపపడుట :—

చిఱునవ్వుతేకులఁ జెన్నారు మొగము దా
 మరసౌరభము మదికరఁగ నాని
కలికితనము మీఱఁ దెలివి మెఱుంగులఁ
 జెలఁగించు కనుల కాంతులకుఁ దలరి
నవ్యముల్ హృద్యముల్ నర్మ గర్భితములౌ
 తళుకుఁ బల్కుల తీపిఁదవిలి చిక్కి—
మనసు మైకముఁజెంద మచ్చు మాయలఁజల్లు
 తెలియని ముగ్ధచేష్టలకుఁ జొక్కి—

బుద్ధి వెనుకకుఁ జిత్తంబు ముందునకును
బోవు భిన్నత శాంతిఁ గోల్పోయి, తగును
దగద యను నిలుకడ లేమిఁ దాల్మి వొలియఁ
గోరరాదని తెలిసియుఁ గోరినాఁడఁ
జేరరాదని తెలిసియుఁ జేరినాఁడ.

మెత్తని తియ్యని చల్లని
చిత్తముఁ, జిఱునవ్వు రుచులు, సిగ్గుమొగముఁ, గ
న్నెత్తని రూపము, హృదయో
న్మత్తతఁ గలిగింప నిట్టె మాటలు పుట్టెన్.

ఆకస్మికంబుగ నడరి యకాలంపు
మారుతంబులు రేఁగి మనసుఁ గలఁచి
యడుగంటి యుండిన యంగజ వికృతులఁ
బొంగి పొరలఁ జేయ, బుద్ధిమతివి
ధీరవు, సహజగంభీరస్వభావవు
నగుట నిశ్చలలీల నాపి యణఁచి
నిర్నిద్ర శాంతిని నిస్తుల గౌరవ
మును స్థిరంబులు జేసికొని కరంబు

వెలిఁగితివి, భవ చ్ఛీల పవిత్ర కాంతి
విశద మయ్యె నా పోయిన విమతగతులు,
దారితప్పినవానికి దారిఁ జూపి
పాపమునకు దుష్కీర్తికిఁ బాపి తమ్మ!

నీ యత్నముల సమున్నతి
నీ యుజ్జ్వలమైన ప్రజ్ఞ నీ యౌదార్య
శ్రీయును నిరుపమ హృదయం
బేమెడఁ గన సాధ్యమౌనె యీ కలినాళ్లన్ ?

మాయదెరలెను నీ మహామహిమఁ జేసి
పరవశత్వము వాసె నీ భవ్యకరుణ,
నై మఱపు ద్రిమ్మగ్గెఁ జిత్తంబు మామకంబ;
నియతి నిఁకనైన నాబుద్ధి నిలుచుఁ జెడక.

నిన్నుఁ గోపించు టొక్కొ! నీ నేర మేమి?
చేసినవి యెల్లఁ జేసిన చెనఁటి నేన,
బాల, నమ్మిన సఖి, శుభవ్రత, మదీయ
రక్షణంబున నుండెడు రామ యనక
యనుచితములను దలపోసి యధముఁ డైతి.

నీకు నవి యసహ్యములౌట నేర మెల్లు?
నిప్పుఁ జెదలంటఁజాలమి నిప్పుతప్పె?
మంచి మెత్తని మాటల మందలించి
భద్రపఱచికొంటివి భవద్వ్రతము, సుఖము.

వయసునన్ జిన్నవయ్యును, భావగరిమ,
జ్ఞానసూక్ష్మత, ధర్మసంకల్పనిరతి,
సరససంస్కృతభాషా ప్రశస్త విద్యఁ
బ్రథమగణ్యులలోఁ జేర్పవలయు నిన్ను.

కావున నిరంతరము నా
భావము, గౌరవముఁ బ్రీతిబంధురముగ, నా
నా విమలసపర్యలతో
నీవలనను నిలుచుఁగాత నిక్కపుఁ బేర్మిన్.

నను మన్నింతువ కోమలాత్మ! నిజ మ
న్యాయంబు నేఁ జేసితిన్;

వినుతంబై, పరిపూరితమై, సరళమై,
విస్తారకారుణ్యమై,
జనతాకర్షణహాసభాసితము నై,
సంతోషమూ నీదు యా
వనమున్ జింతలఁ జెంద జేసితిని; పా
పం బెట్లు వాయున్ సఖీ!

నీ నిష్ఠలు, నీ వ్రతములు,
నీ నిశ్చల దైవభక్తి, నీ సుకృతంబుల్,
పూని, ననున్ గడ తేర్పఁగ
నో నిరుపమశీల! కరుణ నొనరింపఁ గదే.

నను నుద్ధరింపఁబుట్టిన
ఘనకరుణామూర్తి వమ్మ, కాంతా! దైవం
బ నిజంబుగ, నీ వరమునఁ
గనఁ గలిగితి జన్మసార్థకత, నా తల్లీ!

నీ జన్మము కారణముగ
నాజన్మము ధన్యతాఘనత్వము నందెన్
తేజము దీర్ఘాయువు వి
భ్రాజితలోకప్రసిద్ధి వఱలుత నీకున్.

# కట్టమంచి రామలింగారెడ్డి

జననం 1880. చిత్తూరుజిల్లా కట్టమంచి గ్రామం. 1902-06 గవర్నమెంటు స్కాలరు షిప్పుతో కేంబ్రిడ్జిలో ఎం. ఏ. చదివి ప్రథమ తరగతిలో ఉత్తీర్ణుడయ్యెను.

1906 లో కేంబ్రిడ్జి యూనియనుకు ప్రథమ భారతీయ ఉపాధ్యక్షుడు. 1907 లో అమెరికా సంచారము. బరోడా కాలేజీ వైస్ ప్రిన్సిపాలు. మైసూరులో అసిస్టెంట్ ఇన్‌స్పెక్టరు జనరల్ ఆఫ్ ఎడ్యుకేషన్‌గాను, మైసూరు మహారాజా కాలేజి ప్రొఫెసరుగాను ఉండిరి. 1913 - 14 లో విదేశాలలోని విద్యావిధానాన్ని తిలకించి మైసూరు విశ్వవిద్యాలయానికి ప్రణాళిక తయారుచేసిరి. తిరిగి 1916 - 18 వరకు మైసూరు కాలేజి ప్రిన్సిపాలుగను, 1918 - 21 వరకు ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ ఎడ్యుకేషనుగను ఉండి తరుపరి దీనికి రాజీనామా చేసిరి. ఆల్ ఇండియా ఎడ్యుకేషన్ ఎడ్వయిజరీ బోర్డు మెంబరు. 1924 లో ఆంధ్రమహాసభ అధ్యక్షులు. 1926 లో ఎం. ఎల్. సి. ఆంధ్ర విశ్వవిద్యాలయ స్థాపక ఉపాధ్యక్షులు. మొత్తం మూడుసార్లీ పదవిలో నుండిరి. 1936 లో డి. లిట్. బిరుదమును. 1942 లో సర్ (కె. సి. ఐ. ఇ.) బిరుదమును పొందిరి. ముఖ్య రచనలు అర్థశాస్త్రము, కవిత్వతత్వ విచారము. కవి, విమర్శకుడు, వక్త, మేధావి. మరణం 1951.